

శ్రీ అరవిందులు

# యోగదీపికలు



...శకులు:

...ంకట కృష్ణయ్యాగారు

శ్రీఅరవిందాశ్రమం పుదుచ్చేరి.

# విషయ సూచిక

# యోగదీపికలు

## లక్ష్యము

ఇచ్చట సాధనచేయు యోగమార్గ మితరమార్గములకంటెు భిన్నోద్దేశము గలిగియున్నది,—ఏలన, దాని లక్ష్యము, సాధారణ అజ్ఞానచేతననుండి దివ్య చేతనలోని కవరోహణం బొనర్చుటయేగాక, ఆ దివ్యచేతనయొక్క విజ్ఞానశక్తిని అజ్ఞానమయ మనఃప్రాణశరీరములలోనికి గొనివచ్చుటయు, వానిని బరివర్తన మొనర్చుటయు, భగవానుని నిచట స్థాపించుటయు, జడమునందు దివ్యజీవనమును సృష్టించుటయు నగును. కఠోరమైన లక్ష్యమిది, బహు కష్టమైనయోగ మియ్యది. అనేకులకిది యసాధ్యముగ కనపడును. పాదుకొనియున్న సామాన్య అజ్ఞానప్రాపంచిక చేతనాశక్తులన్నియు దీనికి విరుద్ధములు, దీనిని లేదనును, దీని నాటంకపరుప యత్నించును. దీని సిద్ధికి, సాధకుడు తనయందలి మనః

ప్రాణశరీరములుకూడ, ప్రబలమగు విఘ్నములతోనిండి యున్నట్లు కనుగొనును. ఈ లక్ష్యమును నీవు హృదయ పూర్వకముగా స్వీకరింపగలవేని, కష్టములన్నిటి నెదు ర్కొనగలవేని, గతమును దాని బంధములను వెనుకకు పాఱవైచి యీ దివ్యసాధ్యతకొఱకు త్యజించి గోల్పో వుటకు సంసిద్ధుడవగుదువేని, అట్టితరి స్వానుభూతివలన, దానివెనుక నుండుసత్యమును గనుగొన నాశించగలవు.

ఈ యోగసాధన ఏదోయొక నియమిత మాన సిక ప్రబోధము, విధ్యుక్త ధ్యానరూపములు, మంత్ర ములు లోనగువానిచేగాక, అభీప్సవలన, ఆంతరిక, లేక యూర్ధ్వ ఏకాగ్రతవలన, భగవత్ప్రభావమునకు, మన పైనున్న దివ్యశక్తికి, దాని కార్యకలాపమునకు, హృద యాంతర్గత దివ్యసాన్నిధ్యమున కాత్మోన్మీలన మొనర్చు ట వలనను, వీనినన్నిటికి విరుద్ధములగువాని విసర్జించుట వలనను, సాగును. ఈ యాత్మోన్మీలనము, శ్రద్ధ, అభీ ప్స, ప్రపత్తి, వీని మూలముననే రాగలదు.

***

ఈ యోగములో నేదైన నిర్మాణమునకు స్థాన మున్న, అది విజ్ఞాన సృష్టికిని, దివ్యసత్యమును పృథ్వి లోనికి మనఃప్రాణములలోనికి తెచ్చుటయే గాక, శరీర

ములోనికి, భౌతికములోనికి గొనివచ్చుటయగును. అహంకారవ్యాప్తికిగల హద్దుల నన్నింటిని తీసివేయుట గాని, అహంకేంద్రీకృతమైన ప్రాణశక్తియొక్క వాంఛలను, మానసికభావములను సఫలమొనర్చుటకు స్వేచ్ఛావకాశమును గలిగించుటగాని మన యుద్దేశము కాదు. మన యిష్టానుసారము చేయుటకుగాని, మన ఇచ్ఛవచ్చినట్లు చేయగల ప్రపంచమునైన నిర్మించుటకుగాని, మన మిచ్చటలేము. దైవ మిచ్ఛగించినదానిని చేయుటకును, మానవ అజ్ఞానమువలన, నిక నేమాత్రము వికృతము గాంచక, ప్రాణ వాసనలచే వికారమునందక, భగవదిచ్ఛాశక్తి తనసత్యమును అభివ్యక్తమొనరింపగల జగత్తును నిర్మించుటకును మన మిచ్చటనున్నాము. విజ్ఞాన యోగసాధకుడు చేయవలసిన పని, తన కనుకూలమైన నిబంధనలతో కూడిన స్వకార్యముకాదు. కాని, అది భగవానుడు విధించిన నియమములతో కూడిన దివ్య కార్యము. మనయోగము భగవానునికొఱకే కాని, స్వార్థమునకు గాదు.

మనముకోరునది మనవ్యక్తిఆవిష్కారముగాని, సకల పరిమితులనుండి, సకల బంధములనుండి విముక్తమైన వ్యక్త్యహంకారముగాని గాక, భగవదావిష్కార

మునే. ఆ యావిష్కారమున, మన స్వీయాధ్యాత్మిక ముక్తి, సిద్ధి, సంపూర్ణత యొక ఫలితము నంశమును మాత్రమేగాని, యేవిధమైన అహంకార భావమునగాదు. స్వాకాంక్షా ప్రయోజనమునకుగాదు, అహంకేంద్రీకృత యుద్దేశమునకుగాదు, ఈ ముక్తి, సిద్ధి, సంపూర్ణతలు కూడ మన స్వార్థమునకుగాక, భగవానునికే యగును.

***

ఈ యోగము కేవలము భగవత్సాక్షాత్కారమునకే గాక, బహిరంతర్జీవనము దివ్యచేతనను అభివ్యక్త మొనర్చుటకును, దివ్యకార్యాంశ మగుటకు నర్హమగు నట్లొనర్పగల పరివర్తనమును, పరిపూర్ణని వేదనగ నున్నది. అనగా నిది కేవల నైతికమును దైహికమునైన తపస్సు కంటె దారుణము కష్టమునైన అంతస్సాధనగ నున్నది. అన్ని యోగములకంటె మిక్కిలి బృహత్తరము నతి దుర్ఘటము నగు ఈ మార్గము నెవరును, తుదివఱకు నెగ్గగల సంసిద్ధత, అంతరాదేశము నున్నగాని ప్రవేశింపరాదు.

***

పూర్వయోగములలో నిత్యముక్తము, భగవానునితోటి యైక్యమునైన ఆత్మానుభవమునె కోరబడు చుండె. ఆ జ్ఞానానుభవముల కంతరాయము లేకుండ

జేయగలిగినంత మార్పుమాత్రమే మానవస్వభావమునం
దవసరముగ నుండెను. భౌతికమువరకు పరిపూర్ణపరివర్త
నము కొద్దిమందిచే అపేక్షింపబడి, అదికూడ మరెందుకు
కాక నెక్కువ "సిద్ధి" కొఱకే కోరబడుచుండెను. కాని,
పృథ్వీచేతనలలో నూతనస్వభావముయొక్క యావిష్కా
రమునకు కాదు.

⁂

సజీవ పదార్థములో మూర్తీభవించిన మనోమయ
మనుజునియందలిచేతన పరాచేతనను కలిసికొనుట కధిగ
మించవలసియు యున్నది. పరాచేతన సహితము మనః
ప్రాణశరీరములలోని కవరోహించవలసియున్నది. ఆ విధ
ముగ ఆటంకములన్ని తొలగింపబడి, పరాచేతన అపర
ప్రకృతినంతను వశపఱచుకొని విజ్ఞానశక్తి మూలమున
దాని నంతటిని పరివర్తన మొనరించును.

భౌతిక పరిణామమునకు, పృథ్వి, క్షేత్రమగు
చున్నది. మనస్సు, ప్రాణము, విజ్ఞానము, సచ్చిదానందము
పృథ్వీచేతనలో నంతర్నిహితములై యున్నవి; కాని,
భౌతికముమాత్రమే మొదట వ్యవహితమైనది: ఆవల
ప్రాణలోకమునుండి ప్రాణమవరోహించి, భౌతికమందలి
ప్రాణధాతువునకు క్రియాశక్తిని, వ్యూహమును, ఆకారము

నాసంగి, వృక్ష జంతుజాతులను సృజించినది. పిమ్మట మనోలోకమునుండి మనస్సవతరించి, మానవుని సృష్టించినది. ఇకను విజ్ఞానమయపురుషజాతిని సృష్టించుట కనువుగా విజ్ఞాన మవరోహించవలసియున్నది.

***

శక్తివంతమైన యనుభూతిని పొందుటకు, ప్రకృతి యధీనతనుండి పురుషుని విముక్తు చేసినమాత్రము చాలదు. అజ్ఞానశక్తుల నటనతోనున్న అపరప్రకృతి అధీనత నుండి, పురుషుని ఉత్తమ దివ్యశక్తి ప్రాపుకుచేర్చి, ఆ మాత ఆధిపత్యమునకు ఒడంబడునట్లు చేయవలయు.

దివ్యమాతను అపరప్రకృతి యనిగాని, తచ్ఛక్తిమయమైన యంత్రవిశేషమనిగాని, భావించుట పొరబాటు. పరిణామాన్వితమగు అజ్ఞానము వ్యవహరించుటకై నిరూపింపబడిన యంత్రముమాత్రమే ప్రకృతి. అజ్ఞానమైన మనోమయ, ప్రాణమయ, అన్నమయపురుషుడు భగవత్సంభూతమైనదైనప్పటికిని, దైవముగానట్లు, ప్రకృతి యంత్రమును దివ్యజనని కాదు. పరిణామోద్దేశమునకై ఆమెయంశమిా ప్రకృతియంత్రములోను, వెనుకను యున్నదనుట వాస్తవమే; కాని, స్వతః ఆమె అవిద్యాశక్తికాదు. మఱేమన, దివ్యసిద్ధి, ముక్తికొఱకెవరివైపు

వీక్షింతుమో, ఆదివ్యచైతన్యశక్తి, జ్యోతి, పరాప్రకృతి ఆమెయే.

ప్రకృతిశక్తుల నటనను వీక్షించుచు, వానియం దనురక్తిలేని లేదా నిమగ్నముకాని స్థిరము స్వతంత్ర మునునగు పురుషచేతనోపలబ్ధి, ముక్తిమార్గము, స్థిరత, నిస్సంగత, శాంతియుతమైన బలము, ఆత్మరతి, వీనిని మనస్సులోనికి వలెనే, ప్రాణశరీరములలోనికి అవరోహింపజేయవలెను. ఇవి నెలకొల్పబడినయెడల, ప్రాణ శక్తులక్షోభమునకిక బలికావలసినదిలేదు. కాని, యీ స్థిరత, శాంతి, నిశ్చలబలము, ఆనందములు, ఆధారము లోనికి, దివ్యమాతయొక్క ప్రథమావరోహణఫలితము మాత్రమేయగు. దాని కావల, అత్యుత్తమము, అతి సాత్వికము నయిన సామాన్యప్రకృతిదిగాక, దివ్యస్వభా వముగల, పరాప్రకృతిదైన జ్ఞానము, కార్యనిర్వహణ శక్తి ఉద్రుతానందములు గలవు.

అయినను, ప్రథమమున, స్థిరత, శాంతి, మోక్షము ఇవి యవసరములు. అతివేగముగా ఉద్రుతదివ్య శక్తిని క్రిందికి గొనిరా బ్రయత్నించుట యుక్తముగాదు; ఏలన, సమర్థించుకొనలేనియు, క్షోభాయుతము నపరిశుద్ధ మునగు ప్రకృతిలోనికి తేబడిన యవరోహణ మగునది;

మఱియును, తత్ఫలితముగ తీవ్రసంక్షోభములు కల్గును.

⁂

పరమనస్సు అవరభూమికలకన్న మహత్తరము పూర్ణతరము నగు సత్యమును మనకు ప్రసాదించనేరని యెడల, దానినిసాధింప ప్రయత్నించుట నిరర్థకము. ఒక్కొక్కభూమికయు దాని నైజసత్యములను కలిగియున్నది. వానిలో కొన్ని పరాభూమికలందు సత్యములుగావు. ఉదాహరణము: వాసనాహంకారములు, మనోమయ, ప్రాణమయ, శరీరమయ అజ్ఞానమునందలి సత్యములు. వాసనాహంకారములు లేని మనుజుడచ్చట తనకుతా నేనడచు తామసికయంత్రమగు. మనమూర్ధ్వగతిని బోవుకొలది, వాసనాహంకారములు సత్యములుగా, నేమాత్రము, కనపడవు. కాని, అవి, సదిచ్ఛను, సత్పురుషుని వికృతరూపమొందించు అసత్యములగును. జ్యోతిశ్శక్తులు, తమోశక్తులమధ్య జరుగు పోరాట మిచ్చట సత్యముగనున్నది. ఊర్ధ్వమున కేగుకొలది యందలి సత్యము క్రమముగా సన్నగిల్లుచు, అతీతమనస్సు చేరుకొలది అది సత్యమే గాకుండును. ఇతరసత్యములుండు, కాని కృత్స్నమందు వానిస్వభావము, ప్రాధాన్యము, స్థానము మార్పుగాంచును. సగుణ నిర్గుణముయొక్క

భేదము అధిమనస్సుయొక్క సత్యమే, కాని అతీతమనస్సు
నందు వీటి ప్రత్యేకసత్యము, లయమగు; అచ్చటవి,
అభేదమై, ఏకముగ నున్నవి. కాని, అధిమనస్సుయొక్క
సత్యముల వశపఱుచుకొని యనుష్ఠించనివాడు, అతీత
మనస్సుయొక్క సత్యము నందుకొనజాలడు. అసమర్థ
మైన మానవుని మనోగర్వము, సునిశితమైన భేదము
కల్పించి, తనకు తెలిసినది సత్యమనియు, తక్కినదంతయు
నసత్యమని పేర్కొని, అదేమైననుసరే, పరమసత్యమునకు
గంతులిడును—కాని యది డాంబికము, ప్రగల్భము నైన
తప్పిదము. వ్యక్తి, మెటికల నెక్కవలయు: శిఖరము చేరు
టకు ప్రతిమెట్టుపైన స్థిరముగా కాలూది ఎక్కవలయు.

***

అపరప్రకృతిని గుఱించి, దాని యాటంకముల
గుఱించి, విశేషముగా తలపోయుట తప్పు. ఇది సాధనలో
నిషేధాంశమగు. ఆ యంతరాయములను గమనించి,
పరిశుద్ధమొనర్చవలెను. కాని వాటి విషయము మిక్కిలి
చింతించుట సహాయకరముకాదు. చాల ముఖ్యవిషయ
ము. అవరోహణానుభవముయొక్క సవ్యానుభవములో
సవ్యానుభవమును పొందుటకుముందే, నిమ్నప్రకృతి
కలకాలము సంపూర్ణముగా మార్పుజెందవలయునని

ప్రతీక్షించిన యెడల, శాశ్వతముగా వేచియుండవలసి వచ్చును. నిమ్నప్రకృతి ఎంత యధికముగా పరిశుద్ధ మొనర్చబడిన నంతసులభముగా పరాప్రకృతి యవరోహణ మగుననుట వాస్తవమే; కాని పరాప్రకృతి ఎంత యధికముగా నవరోహణమైన నంత యధికముగా, నిమ్న ప్రకృతి పరిశుద్ధమగుననుట కూడ సత్యము. సంపూర్ణశుద్ధిగాని, నిత్యము పరిపూర్ణమైన ఆవిష్కారముగాని, యివన్నియు తత్క్షణమే రాజాలవు. ఇదంతయు కాలముపైనను ఓరిమితో కూడిన అభివృద్ధినిబట్టి నాధారపడును. శుద్ధి, ఆవిష్కారములు రెండు వరుసగా ప్రవర్ధమానములగుచు, నొండొంటితో క్రీడించుటచే బలకరములగును. అదియే సాధనయొక్క సహజగతి.

***

చేతన పరివర్తన మగునంతవఱకు, నట్టి యుత్తమ తీవ్రానుభవములు నిలిచియుండవు. అవి పరిపక్వమగుటకు కాలముకావలయు. జీవి యెఱుకలేక యుండినపుడీ జీర్ణీకరణము, తెఱమఱుగుననో ఉపరితలముననో, సాగుచుండును. అట్టితరి ఉపరిచేతన తాను బొందినది నష్టమైనట్లును, కేవలము స్తంభించినట్లునుచూచు; కాని జీవుని ప్రజ్ఞావస్థలో, యీపరిపక్వత సాగుచుండుటయు,

నేదియు నష్టము గాకుండుటయు, సత్తాలోని కవరో హించినదంతయు నెమ్మదిగా కుదురుకొనుచుండుటయు చూచును.

ఏ యసారత, గాఢనిశ్చలత, శాంతియను వాటి యందు నీవు నిమగ్నమైనట్లు అనుభూతి పొందితివో, అదియే ఆత్మ, లేక అక్షరబ్రహ్మమని పేర్కొనబడు చున్నది. బహుయోగముల లక్ష్యమంతయు, ఈ యా త్మోపలబ్ధిని, అనగా, అక్షరబ్రహ్మోపలబ్ధిని పొందుట యు, అందుండుటయు నైయున్నది. మనయోగమునం దది భగవత్సాక్షాత్కారము నకును, పరివర్తనమున కును, అనగా దివ్య చేతనలోకి సత్తా మార్పుచెందుట కును, వీటియొక్క ప్రథమావస్థమాత్రమైయున్నది.

***

నిజసత్తాను ద్వివిధావస్థలలో నుపలబ్ధి గాంచ వచ్చును,—పురుషుడు, లేక ఆత్మగను(అంతరాత్మగను), చైత్యపురుషుడుగను, ఒకదానిని సమష్టిగా, మఱొక దానిని మనఃప్రాణశరీరముల కాధారభూతమగు వ్యష్టిగా భావించుటయే భేదము. మొదట, నాత్మసాక్షాత్కార మైనపు డది యన్నింటికంటె వేఱయిన దనియు, స్వయం భువుగను, నిస్సంగిగ నున్నట్లు భావముగల్గు. ఈ యుప

లబ్ధికే, యెండిన నారికేళ ఫలస్వరూప ఉపమాన మన్వయించు. చైత్యసత్త నుపలబ్ధినందినవానికది యట్లుకాదు. ఎందుకన, భగవంతునితోటి యైక్యభావము, తదాశ్రయము, భగవానునికి ఆత్మసమర్పణము, ప్రకృతిని మార్చి, తనలోని యథార్థ మనఃప్రాణశరీరసత్తాను కనుగొనుటకుశక్తి, వీని నన్నిటిని చైత్యసత్తోపలబ్ధి సమకూర్చుచున్నది. ఈ యోగమునకీ ద్వివిధోపలబ్ధు లవసరములు. 'నేను'అను క్షుద్రాహంకారము ప్రకృతివలన వ్యూహితమై, బాహ్యచేతనను, కార్యకలాపమును వ్యష్టీకరించుటలోను కేంద్రీకరించుటలోను, సాహాయ్యపడ నుద్దేశించిన, మనఃప్రాణశరీర వ్యూహముగనున్నది. యథార్థ సత్త నెఱింగినపుడు అహంకారమువలని ప్రయోజనము ముగిసి, యీ వ్యూహ మంతరించిపోవలసియున్నది. అపుడు నిజసత్త స్వస్థానమున స్ఫురించుచున్నది.

***

త్రిగుణములు శుద్ధములై సంస్కారమునుబొంది తమ దివ్య ప్రతిరూపములుగా మార్పు గాంచుచున్నవి. సత్త్వము, జ్యోతిగను, యథార్థమైన అధ్యాత్మికజ్యోతిగను,—రజస్సు తపస్సుగను, శాంతియుతమైన మహత్తర దివ్యశక్తిగ నగు! తమస్సు శమముగ, దివ్య నిశ్చలతగ,

స్థిరతగ, శాంతిగ నగును.

***

సృష్టిస్థితిలయములను మూడు విశ్వశక్తులకు సర్వ పదార్థములు లోనగుచున్నవి. సృష్టించబడినదంతయు కొంతకాలముండి యావల నశింపనారంభించును. లయ శక్తిని దొలగించుట యనగా, ఎల్లప్పుడు ప్రవర్థమానమగు నటువంటి, వినాశనమొందని సృష్టిగాంచుటని భావము. ప్రవృద్ధి నిమిత్తము అజ్ఞానమందు లయ మవసరము. జ్ఞానమునందు, సత్యసృష్టియందు, ప్రళయ మేమియు లేని నిరంతరవికాసమే ధర్మముగానున్నది.

***

# సత్తయొక్క
# కక్ష్యలు, భాగములు

మానవులు తమ్మునుదా మెఱుంగరు తమ సత్తయందలి వివిధభాగముల గుర్తించుటకుగూడ నేర్చుకొనలేదు. ఇవన్నియు వారిచే సాధారణముగా మనస్సని యేకముగా నెన్నబడినవి. ఏలన, మానసిక ప్రతిపత్తి, గ్రహణము, వీనిమూలముననే వారెఱుంగుట, అనుభవించుట; అందువలన వారు తమ స్థాయిగతులను, చేష్టలను దెలిసికొనలేకున్నారు: ఒకవేళ గ్రహించినను, అది యుపరిభాగమునమాత్రమే. మన ప్రకృతియొక్క మహాక్లిష్టత నెఱుంగుట, దానిని నడిపించు వివిధశక్తులను గమనించుట, దాని నిర్వాహణజ్ఞానాధికారమును బడయుట, ఇదంతయు, యోగపునాదియందలి భాగమే. మనలో, ననేకకక్ష్యలు, భాగములుగలవు. వానిలో నొక్కొక్కటియు,—తలంపు, సంకల్పము, ఇంద్రియజ్ఞానము, భావన, కార్యప్రవృత్తి,—మన చేతనయొక్క

సమగ్రప్రవృత్తికి గొంత తోడ్పడుచున్నది. కాని మన మీ ప్రేరణములవ్యుత్పత్తి క్రమమునుగాని, పోకడను గాని గాంచుటలేదు. ఉపరితలమున వానియొక్క గందర గోళము, తారుమారునైన ఫలితములను మాత్రమే మన మెఱుగుచున్నాము. అందువలన, మనము చేయ గలది తాత్కాలికము, నస్థిరమునగుపద్ధతికంటె నెక్కు వేమియు లేదు.

ఇందుకు పరిహారము, తత్పూర్వమే జ్ఞానోన్ముఖ మైయున్న సత్తాయొక్క కక్ష్యలనుండి చేకూరగలదు. ఊర్ధ్వము నుండి దివ్యచేతనా జ్యోతిని ఆహ్వానించుట, చైత్యపురుషుని ముందుకుగొనివచ్చుట, ఆధ్యాత్మికము గా బాహ్యమనస్సును మేల్కొలిపి, ప్రాణమయసత్తాను ప్రజ్వలింపజేయు నభీప్సాజ్వాలను రగుల్కొలుపుట, ఇది యే తరుణోపాయము.

***

యోగమనగా భగవానునితో నైక్యమగుట. ఇది విశ్వాతీతమగు సంయోగముగనో, విశ్వమయ సంయోగముగనో, వ్యష్టిసంయోగముగనో, లేదా, మనయోగములోవలె మూడు నేకముగనో కావచ్చు. అనగా, వ్యష్టిగత మనోప్రాణ శరీరాహంకారములచే

మాత్ర మాబద్ధముగాక, పరమాత్మతోనో, విశ్వచేతన తోనో, లేక తన స్వాఆత్మను, అంతస్సత్తను, ఉనికి యొక్క యథార్థసత్వమును ఎఱుగగల నొక నిగూఢ చేతనతోనో సంయోగమును బొందుటయని యర్థము—యోగచేతనయందు విషయముల నెఱుంగుటమాత్రమే గాదు, శక్తులనుగూడ నెఱుగనగును; శక్తులనుమాత్రమే గాక, తచ్ఛక్తులవెనుకనుండుచేతను సత్తనుసహిత మెఱుగ నగును. దీనినంతను దనలోనేగాక విశ్వమునంతట జీవు డెఱుగవలయును.

నూతన చేతనాభివృద్ధిని వెంబడించు నొకశక్తి యున్నది. అది యాచేతనలో వెన్వెంటనే ప్రవృద్ధి నొందుచు, తచ్చేతన బయల్పడుటకును, పరిశుద్ధినందుట కును సాయపడుచున్నది. ఇదియే యోగశక్తి. ఇట శరీరమునందిది ముకుళితమై, మన యంతస్సత్తలోని యన్ని చక్రములందు నిద్రించి యున్నది. ఇది తంత్రశాస్త్ర మున కుండలినీశక్తిగా బేర్కొనబడు మూలశక్తి. కాని, యిది మన కూర్ధ్వమున, మన శిరస్సుకుపైన, దివ్యశక్తిగా నున్నది. అచ్చట, ముకుళితము, అంతర్నిహితము నిద్రితముగాక, జాగరూకము, తెలివివంతము, శక్తివంత ము, వ్యాపకము, విశాలమునై యున్నది. అది యావి

ష్కారమునకై నచట వేచియున్నది. ఈశక్తికే ఈ మాతృశక్తికే, మన ముముక్షులము గావలసియున్నది. మనస్సునందది దివ్యమనశ్శక్తిగను ఆవిష్కరించు చున్నది. వ్యక్తిగతమనస్సు నెఱవేర్పజాలనిదంతను, ఇదిచేయ గలదు; అప్పుడది యోగమనశ్శక్తియగు. అదేవిధమున, శరీరప్రాణములం దావిష్కరించి, పనిచేయునపు డది యోగప్రాణశక్తిగనో, యోగశరీరశక్తిగనో తెలియనగు. అది అన్నిరూపములందు మేల్కొనగలదు; బయటను, పైనను, విజృంభించుచు, క్రిందినుండి విశాలముగ వ్యాపించ గల్గు; లేదా క్రిందికిపోయి, యచ్చట నన్ని విషయముల కొక నిర్దిష్టశక్తిగా పరిణమింపగల్గు; శరీరములోనికి క్రింద ప్రవహించి, కార్య మొనరించుచు, తన యాధిపత్యము నెలకొల్పుచు, పైనుండి విస్తృతిగ లోన వ్యాపించును, మనలోని నికృష్టమును, మనపైనుండు యుత్కృష్టముతో జోడించుచు, వ్యష్టిని విశ్వగత సర్వములోనికి, కైవల్యము లోనికి పురుషోత్తములోనికి, విముక్తిని జేయగలదు.

***

మన యోగప్రక్రియలలో చక్రము లొక్కొక్కటి యొక నిర్దిష్టమైన అంతఃకరణైకోపయోగము, సాధారణ వృత్తియుకలిగి వీనిపైననే వాటి విశేషశక్తులు, వ్యాపార

ములు నాధారపడియున్నవి. మూలాధారచక్రము, భౌతికము నధశ్చేతనపర్యంతము, శాసించుచున్నది. ఉదరస్థానముననున్న స్వాధిష్ఠానచక్రము అపరప్రాణమును పాలించుచున్నది. నాభిస్థానమందలి నాభిపద్మము లేదా మణిపురచక్రము బృహత్ప్రాణమును, హృత్స్థానమగు హృత్పద్మము లేదా అనాహతచక్రము భావప్రేరణ సత్త్వను, కంఠస్థానమందలి విశుద్ధచక్రము వ్యక్తపఱచునట్టి బహిర్గతమగునట్టి మనస్సును, భ్రూమధ్యమందున్న ఆజ్ఞాచక్రము ఇచ్ఛాపూర్త మనస్సును, సంకల్పమును, దృష్టిని, మానసికరూపములను, యీ విధముగ వివిధచక్రములు శాసించుచున్నవి. ఊర్ధ్వముననుండు సహస్రదళచక్ర మున్నతచింతనామనస్సును, శాసించి, యింకను బరమైనట్టియు ప్రకాసించు మనస్సుకు నెలవౌసంగుచు, అత్యంతపరమున, స్వతఃస్ఫురణమనస్సున కభిముఖము, వికసితము నగుచున్నది; ఆ స్వతఃస్ఫురణమూలముననగాని, లేదా, మహత్తర సాక్షాత్కారమువలననగాని, అధిమనస్సు, తదితరముతో సంసర్గమును, సన్నిహితసంబంధమును గాంచగలదు.

మనయోగమున, నధశ్చేతన మనగా, జాగరూకముగానుండు, సజ్ఞాన సవ్యవిచారము, సంకల్పము,

భావన, నిర్మాణయుతప్రక్రియ ఇవిలేని నిర్మగ్నమైన సత్తా యొక్క అంశమని అర్థము. ఇట్లయ్యు, యీ యధశ్చేతన నన్నివిషయముల గుఱించిన భావనల నస్పష్టముగా నందుకొని తనలో సంగ్రహించుకొనుచున్నది. ఈ యధ శ్చేతననుండి నపరిష్కృతముగా నా వృత్తి నేలుచుండెడియు, వింతరూపములలో ప్రచ్ఛన్నముగా నుండెడియు, మూర్ఖపు యలవాటులయొక్క సర్వవిధోద్రేకములును, స్వప్నావస్థయందుగాని, జాగ్రదావస్థయందుగాని, యుప్పొంగగలవు. ఈ భావచిహ్నము లత్యధికముగా స్వప్నమం దసంబద్ధము గను, నియతిలేకను పైకి వచ్చునేని, యివి మన జాగ్రదావస్థలోకూడ, యంత్రావృత్తిరూపక బూర్వచింతనలుగను, మనఃప్రాణశరీర సంబంధములగు పూర్వాభ్యాసములుగను, లేదా, మన జాగ్రచ్చింతననుండిగాని, ఇచ్ఛనుండిగాని వేఱుపడనట్టియు తత్ప్రతిపత్తులకు, అభీష్టములకు, తదాజ్ఞలకు, పలుమారు వ్యతిరేకముగానున్న ఇంద్రియజ్ఞానములకు, క్రియలకు, మనోవికారముల కొక నిగూఢ ప్రేరేపణములుగను కాగలవు; అట్లగుచున్నవికూడ, ఆధశ్చేతనలో పూర్వపు మూర్ఖసంస్కారభరితమైన, నిగూఢమనస్సు, సహజవాసనా చేష్ట. ధాతుప్రక్రియా బీజములతో నిం

డిన, నిగూఢ ప్రాణము, శరీరస్థితికిసంబంధించి దాని
నెక్కువగా శాసించు, నిగూఢభౌతికమును కలదు. మన
జబ్బుల కిదియే చాలవఱకు కారణభూతము. దీర్ఘవ్యాధు
లకుగాని, పదేపదేవచ్చు రుగ్మతలకుగాని, అధశ్చేతన
ము, దాని మూర్ఖపు జ్ఞాపకము, శరీరచేతనపై నేది
యంకితమాయెనో దాని యావృత్త్యభ్యాసము, ఇవియే
నిజముగా ముఖ్యకారణములు. కాని, యీ యధశ్చేతన
మును మన సత్తాలోని అతఃకక్ష్యలైన సూక్ష్మ భౌతిక
చేతనము, అంతఃప్రాణమనస్సులు, వీనినుండి స్పష్టముగా
ప్రత్యేకించవలయును. ఏలన, ఇవన్నియు నేమాత్రము
నిగూఢములైగాని, అసంబద్ధములుగ గాని, దుర్వ్యాహ
ములైగాని గాక, మన బాహ్యచేతననుండి మఱుగుపడి
యున్నవి. మన బాహ్యచేతనము నిరంతరము వీనినుండి
కొంత గ్రహించుచున్నది, కాని యవి ఎచ్చటనుండి
వచ్చునో చాలవర కెఱుంగదు.

***

మనకు విదితమగు భౌతిక ప్రపంచమునకు పైన
స్వతస్సిద్ధమగు ప్రాణమయభూమిక ఒకటి కలదు. ప్రాణ
మయ, అన్నమయ, భూమికలపైన స్వతస్సిద్ధమగు
మనఃకక్ష్య యొండుగలదు. మనోమయ ప్రాణమయ

అన్నమయ కక్ష్యలగు నీమూడును అపరప్రకృతియొక్క త్రిలోకము లనబడుచున్నవి. ఇవి పరిణామమువలన బృథ్వీచేతనలో ప్రతిష్ఠితములై యున్నవి. కాని పరిణామమునకుబూర్వమే స్వతస్సిద్ధముగ స్థాపితములై భూమికి సంబంధించిన భౌతికకక్ష్యకు, పృథ్వీచేతనకు పైగానున్నవి.

⁂

మనుజులందలి ప్రాణప్రకృతికి వెనుక నంతటను, బాహ్యప్రాణస్వభావమునకు భిన్నముగనుండు, యాతని యథార్థప్రాణసత్తా మఱుగువడి, యచలమై యున్నది. బాహ్యప్రాణము, సంకుచితము, అజ్ఞానము పరిమితమునై, నిగూఢవాసనలు, కోరికలు, ఆశలు, తిరుగుబాటులు, సుఖదుఃఖములు, క్షణభంగురములగు మోదఖేదములు, ఉత్సాహ విషాదములు వీనితో నిండియున్నది. తద్విరుద్ధముగా యథార్థప్రాణసత్త విస్తారముగా, విశాలముగా, శాంతముగా, బలముగా, మితిలేమిగా, సిద్ధముగా, అచలముగా, సర్వశక్తిజ్ఞానానందములకు యోగ్యమై యున్నది. మీదుమిక్కిలి యది యహంకార రహితమైనది. ఏలన, తాను భగవానుని సృష్టియు, యుపకరణమనియు నది యెఱుంగును. అది శుద్ధము, పరిపూర్ణమునైన దివ్యయోద్ధ, అందు సకల దివ్యోపలబ్ధులకును

కారణభూతమైన శక్తిగలదు. ఆ నిజప్రాణసత్తయే మేల్కొని నీలో ముందుకువచ్చియున్నది. ఇట్లే యథార్థమైన మానసికసత్త, సత్యమైన భౌతికసత్తగూడ యున్నవి. ఇవి యభివ్యక్తమైనపుడు నీలోని ద్వంద్వస్థాయిని నీ వెఱుంగుదువు : నీలో వెనుకనున్నది, సర్వదా స్థిరతగలిగి, ప్రబలముగ నున్నది. నీ బాహ్యము మాత్రమే సంక్షోభితము, మాలిన్యమనియు నీవు తెలిసికొనగలవు. కాని వెనుకనున్న నిజసత్త, నిశ్చలముగనుండి నీ వందున్నయెడల, నిక సంక్షోభమాలిన్యములు, పైపైన మాత్రమే యుండును. ఇట్టిస్థితిలో సత్తాయొక్క బాహ్యకక్ష్యలను మఱింత సమగ్రముగా శాసించ నగును; వానిని ముక్తముగా, శుద్ధముగా, గూడ నొనర్పవచ్చును.

***

"మనస్సు" అను పదము, వివేచనలేక చేతన కంతకు సాధారణముగా నుపయోగింపబడుచున్నది. ఏలన, మానవుడు మనోమయపురుషుడు, సమస్తమును మనోమయ మొనర్చుచున్నాడు. కాని 'మనస్సు' 'మానసికము' అను పదము లీ యోగపరిభాషలో, గ్రహణము, బుద్ధి, వీనితోను, మానసిక లేక చింతనా ప్రతిప

త్తులు, విషయములకు సంబంధించిన ప్రతిఘటనలు వీని తోను,తన బుధ్యంశము లైన యథార్థమానసికవృత్తులు, రూపములు, మనోదృష్టి, సంకల్పము, వీనితోను సంబంధము గల స్వభావాంశమును ముఖ్యముగా స్ఫురింపజేయుటకే, వ్యవహరింపబడుచున్నవి. ప్రాణధాతువునందు, మనోధాతువు కొంత జొప్పింపబడియున్నను, మనస్సునుండి ప్రాణము నతిజాగ్రత్తతో బరిత్యేకించవలసియున్నది. కోరికలు, చేష్టలు, భావములు, ఉద్రేకములు, క్రియాశక్తులు, కామనాసంకల్పము, మానవులోని వాసనాత్మకా ప్రతిఘటనలతోను, 'నాది' యను అహంకారము, తద్రూపమైన యితరభావక్రీడలతోను, యీప్రకృతికిసంబంధించిన, క్రోధ, భయ, లోభ, కామనాదులతోను గూడిన జీవనస్వభావమే ప్రాణసత్త. చేతనయొక్క పైభాగమున, ప్రాణము, మనస్సు మిళితమైయున్నవి, కాని అవి కేవల భిన్నశక్తులు; సామాన్యబాహ్యచేతనము వెనుకకు పోయినపుడు వానిని వేర్వేరుగా గుర్తించి, వాటి ప్రత్యేకతను గనుంగొని, యీజ్ఞానసాయమున, వాని బాహ్యసమ్మేళనమును, వికీర్ణమొనర్పనగును. ప్రాణసత్త తృప్తిపడక, సమర్పణమొనర్పక, సామాన్యజీవితాకర్షణా వేగవాసనలయందు

తగులొ్కని మూర్ఖముగ వ్యవహరించునపుడు, మనస్సు యోగలక్ష్యమునుగాని దైవమునుగాని స్వీకరించుటకు, కొన్ని సమయములందు శీఘ్రకాలము, మఱికొన్ని సమయములం దత్యంత దీర్ఘకాలముపట్టుట, సాధారణము, సహజముకూడ. వాని విభేదము, లేక పోరాటము, సాధనయందలి తీవ్రతరమగు కష్టములలో, పెక్కింటికి కారణము.

⁂

మనోమయపురుషుడు, లోపల నీలో జరుగు దానినంతయు, గమనించుచు, పాటించుచు, తీర్పుచేయుచు నుండును. చైత్యపురుషుడు సాక్షివలె యీవిధముగా కనిపెట్టి గుర్తించక, తన నైజ పవిత్రతవలనను, అంతఃస్థితమగు దివ్య-సహజజ్ఞానమువలనను, మఱింత ప్రత్యక్షము, తేజోమయము నగు మార్గమున స్వయముగనే గ్రహించి తెలిసికొనును. అందువలన చైత్యసత్త ముందుకొచ్చినపుడెల్లను, నీ స్వభావమందలి ఉత్తమ దుష్కృతచేష్టలను వెల్లడిచేయును.

మనుష్యసత్త, ఈ తత్త్వములతో సమ్మిళితమైయున్నది,—అన్నింటిని భరించుచు, వెనుకనుండు చైత్యపురుషునిలోను, అంతఃస్థితమైన మనఃప్రాణ శరీర

ములలోను, వానిని వ్యక్తపఱచు యుపకరణములగు మనఃప్రాణశరీరముల కేవల బాహ్యప్రకృతి లోనుకాక వీని కన్నింటికిపైన కేంద్రస్థమైన జీవాత్మగలదు. తన యావిష్కారమున కది వీని నన్నింటిని యుపయోగించు కొనుచున్నది. అది ఈశ్వరాత్మయొక్క అంశము. బాహ్య పురుషునందు తన్ను గుఱించిన ఈసత్యము మఱుగు పఱుపబడి, మానసిక ప్రాణమయ అహంకారముచేత ఈయంతరాత్మ కప్పబడియున్నది. తమ్ము తా మెఱుంగ నారంభించినవారు మాత్రమే తమ యథార్థ కేంద్ర సత్తను యెఱుంగుదురు. అట్లయ్యును, మనఃప్రాణశరీర వృత్తులవెనుక అది సర్వదా నిలిచి, భగవదంశ మగు నట్టియు పరమాత్మయొక్క విస్ఫులింగమగు చైత్య పురుషునిచే ప్రాతినిధ్యము వహించియున్నది. తనలోని చైత్యాంశాభి వర్ధమానముననే, ఊర్ధ్వమున నున్న జీవాత్మలో ప్రజ్ఞాపూర్వకమైన స్పర్శ ననుభవింప జీవు డు మొదలిడుచున్నాడు. ఇది ఫలించి అటుపిమ్మట జీవాత్మ, స్వభావములోని ప్రవృత్తులను వశపరుచుకొని క్రమపద్ధతిని యేర్పాటుచేయునపుడు, కేవల మసంపూర్ణ మగు మానసిక, నైతిక స్వాతంత్ర్యమునకు బదులు పూర్ణ ఆధ్యాత్మికస్వారాజ్యము ప్రాప్తించును.

***

మనలో నన్నింటిని భరించునట్టిన్ని, జనన మరణ ముల గడచియుండునట్టిన్ని, భగవదంశమునకే, 'కేంద్ర సత్త' (జీవాత్మ)అను పదము సాధారణముగా మన యోగములో నుపయోగింపబడుచున్నది. ఈకేంద్రసత్త ద్వివిధరూపములుగలది,—పైన, జీవాత్మగను, మన కున్నతమైన ఆత్మజ్ఞానము కలిగినపుడు, మన యథార్థ సత్తగను నెఱుంగుదుము,—దిగువ,మన ప్రాణశరీరముల వెనుకనున్న చైత్యసత్తగను యున్నది. జీవాత్మ సృష్టి కతీతముగనుండి, దాని నధిష్టించియుండు: చైత్యసత్త యన్ననో సృష్టివెనుక నిలిచి, దానిని భరించుచున్నది.

చైత్యసత్తాయొక్క సహజభావము, పసిబిడ్డగా, భగవత్పుత్రుడుగా, భక్తుడుగా తను భావించుటయే. అది భగవదంశమై, వస్తుతః ఒక్కటియే, కాని సృష్టిక్రియా కలాపములో నైక్యతలోగూడ నెల్లపుడు భిన్నత్వము కల్గియున్నది. జీవాత్మన్ననో, తదాత్మ్యభావమున, భగ వానునితో నైక్యమగుచున్నది. కాని, అదిగూడ సృష్టి క్రియాకలాపములపైన నధిష్ఠించినపుడు, ఉత్తరక్షణము ననే, పరమేశ్వరుడుగా గాక, విశ్వరూపియొక్క భగవానునియొక్క యొక కేంద్రముగా తన్నెఱుంగును.

ఈవివక్షతను, జ్ఞాపకముంచుకొనుట ముఖ్యము; ఏలన, అట్లుగాదేని, లవమేని ప్రాణమయఅహంకార మున్న యెడల, తానే యవతారమని తలపోయవచ్చును; లేదా శ్రీ రామకృష్ణునివద్ద నుండిన హృదయునివలె మతి చెడి తబ్బిబ్బుగావచ్చును.

⁂

పురుషు డాత్మ, బ్రహ్మము; మూలతత్త్వమున భగవానుడు.

ఏకమగు భగవానుడు, తన నిరంతరస్వభావజన్య బహుత్త్వము నభివ్యక్త మొనర్చునపుడు, తదభివ్యక్తి నిమిత్తమై, ఆత్మ జీవాత్మయగుచు, పైనుండి యిట తన వ్యక్తులపై ప్రాపంచికజీవుల పరిణామము పై నధిష్ఠాన మొనర్చును. కాని, తాను మాత్రము భగవానుని సనాతనాంశముగను, సృష్టికి పూర్వముగనున్నది— పరాప్రకృతిర్జీవభూత యగును.

ఈ అపరాప్రకృతి సృష్టియందు, భగవానుని యొక్క సనాతనాంశ, వ్యష్టిపరిణామమును, మనఃప్రాణ శరీరసత్తను దృఢపరచుచు, ఆత్మగను, దివ్యాగ్నికణము గను గనపడుచున్నది. చైత్యపురుషుడు చేతనాభివృద్ధితో వికాసము నొందునట్టిన్ని అగ్నిగా ప్రవర్ధమానమగు ఈ

కణము. కావున, చైత్యసత్త, జీవాత్మవలెగాక, పరిణామములో వృద్ధినొందు.

కాని మానవుడు ఆత్మనుగాని, జీవాత్మనుగాని యెఱుంగడు. తన అహామునుమాత్రమే నతడెఱుగును. లేదా ప్రాణశరీరముల శాసించెడి మనోమయ సత్తనెఱుంగును. కాని మఱింత గూఢముగా నుండు, చైత్యసత్తను, హృదయమందలి పురుషుడుగను, తన ఆత్మగను, తన యథార్థకేంద్రముగను అతడెఱుంగును. పరిణామమందు చైత్యసత్త కేంద్రసత్తగ నుండి, భగవానుని సనాతనాంశమగు జీవాత్మనుండి వెలువడుచు, తత్ప్రతినిధి యగుచున్నది. సంపూర్ణచేతన కల్గినపుడు జీవాత్మయు, చైత్యసత్తయు నేకమగును.

అహాము ప్రకృతియొక్క యొక నిర్మాణము. కాని అది కేవలము భౌతికప్రకృతియొక్క నిర్మాణము మాత్రమే కాదు. అందువలన, శరీర లయముతో అది లయముగాదు. మానసిక, ప్రాణమయ అహంకారములుకూడ గలవు.

ఇట, భౌతికచేతనయొక్క మూల మవిద్యమాత్రమే గాదు, నిశ్చేతనముకూడ. అనగా, చేతన జడమునందలి రూపమునందు, శక్తియందు, నంతఃస్థితమై యున్నది.

భౌతికచేతన మాత్రమే గాక, మనఃప్రాణచేతనలు గూడ సత్యమునుండి యవిద్యచే వేఱుచేయబడినవి.

***

సంస్కృతభాషలో "జీవు"డను పదమునకు రెండర్థములు గలవు—జీవరాసులనియు, జన్మప్రభృతి, మరణాంతము ప్రాణియొక్క యావిష్కారమును భరించు, వ్యష్టిగతమైన ఆత్మయనియు, కడపటిఅర్థమందు జీవాత్మ, అనగా జీవసత్త్వయొక్క సనాతనాత్మ. అదియే గీతలో నలంకారరూపమున, 'మమైవాంశో జీవభూతః సనాతనః'అని చెప్పబడియున్నది. కాని నీవు యుపయోగించిన "తునక" అను పదము, మిక్కిలి కఠినముగ నున్నది. అది రూపముల కన్వయించగలదుకాని, వాని యందలి మూలమునకుగాదు. మరియు, నానాత్వైదైవ మిచ్చుట సృష్టికి పూర్వమందే యుండు. జీవాత్మను గుఱించిన విపులవర్ణన నిట్లుండును : వ్యష్ట్యాత్మకముగా నవతరించిన నానాత్వైదైవము, లేదా సృష్టింపబడిన సత్త్వయొక్కఆత్మ. వస్తుతః, జీవాత్మ మార్పునొందదు, పరిణామము బొందదు ; వస్తుతః వ్యష్టిగతపరిణామమున కది పరముగానున్నది. పరిణామమునందును స్వభావము నంతటిని భరించు చైత్యసత్త్వాయొక్క ప్రతినిధిగా నగు

చున్నది.

భగవానుడభేదుడు గాన జీవునికి యథార్థ యునికి లేదని అద్వైతవేదాంతము చాటుచున్నది. వేరొక సాంప్రదాయము, విశిష్టాద్వైతముప్రకారము జీవుడు వస్తుతః ఒకడైనను, ఆవిష్కారములో, భిన్న మగుననియు, సృష్టి సనాతనమనియు, సత్యమైనదనియు, మాయ కాదనియు చెప్పుచున్నది. ద్వైతమతములు జీవుడు వేరనియు లేదా పరమాత్మ, జీవాత్మ, ప్రకృతి ఈమూడింటిలో నొకటనియు స్థిరపరచెదరు.

⁂

జీవుడొక్కొక్క పర్యాయము జన్మమెత్తుచు పూర్వజన్మపరిణామము ననుసరించి, ముందవసరమును బట్టి, విశ్వప్రకృతియొక్క మూల పదార్థములనుండి, మన ప్రాణశరీరముల నేర్పరచుకొనుచున్నాడు.

శరీరము శిథిలమైనప్పుడు ప్రాణము ప్రాణభూమికలో చేరి నచట కొంతకాల ముండును. అటుపిమ్మట ప్రాణముయొక్క కోశము లయమైపోవును. చివర లయ మగునది మనోమయకోశము తుదకు జీవుడు లేదా చైత్యసత్త, మరల జన్మమును సమీపించువఱకు, చైత్యలోకమున విశ్రమించుట కరగుచున్నాడు.

సామాన్యపరిస్థితులలోనుండు మానవుల కిదియే సహజపద్ధతి. వ్యక్తి యొక్క స్వభావము ననుసరించి యాతని అభివృద్ధిననుసరించి భేదము లుండును. ఉదాహరణము: మానసికసత్త దృఢవికాసము నొందినయెడల అది అటులనే యుండగలదు. అటులనే యథార్థ చైత్య సత్తాయందు కేంద్రీకృతమై, పరిరక్షితమైన ప్రాణ సత్తయు యుండగలదు. అవి చైత్యపురుషుని యమరత్వము ను బొల్గొనును.

జీవుడు జీవితమందలి తన యనుభవముల ప్రధానాంశముల గైకొని పరిణామాభివృద్ధికి వానిని మూలముగా నొనర్చుకొనును. జీవుడు పునర్జన్మ మెత్తినపుడు ఆ జన్మమున కుపకరించు అనుభవములను పూర్వకర్మ నుండి మనోప్రాణముల వెంటతీసికొని వచ్చును.

జీవునియొక్క ప్రాణాంశమునకే నిజముగా శ్రద్ధాదిక్రియలు చేయబడుచున్నవి, చైత్య శాంతిలో విశ్రాంతి బొందుటకును త్వరితముగా వెళ్ళుటకును, భౌతికమునకును, ప్రాణమయలోకములపట్ల నింకను మమతతోనుండు ప్రాణగతస్పందముల నుండి విముక్తి నొందుటకును యీకర్మలు చేయబడుచున్నవి.

***

వ్యక్తియందలి చేతన, బాహ్యమున విశ్వచేతన లోనికి విస్తరించి, దానితో నెట్టివ్యవహారమైన నడుపు కొనగలదు. అందు జొఱబడి దాని పోకడల నెఱుంగ గలదు, దానిపై వ్యవహరింపగలదు, దానినుండి గ్రహించగలదు, దాని కనురూపముగనయి, దానిని పొందియుండగలదు. ప్రాచీనయోగ పరిభాషలో నిట్టి స్థితికి, 'లోన బ్రహ్మాండ ముండుట' యని భావింపబడు చుండె.

సకలసత్తల శక్తులతోగూడిన విశ్వము, విశ్వాత్మ, విశ్వప్రకృతి, వీనియొక్క చేతనానుభవమే, విశ్వచేతన. వేఱువిధముగ నైనప్పటికిని, వ్యష్టి ప్రత్యేకముగా నెఱుకగలిగి యున్నట్లు, ఆ విశ్వచేతన కృత్స్నముగా నెఱుకగలిగి యున్నది. దీని యంశమే వ్యష్టిచేతన, కాని యది తానొక ప్రత్యేకసత్తగా భావించు యంశ ము. అయినను, వ్యష్టి అనుభవించుదానిలో నెక్కువ భాగము విశ్వచేతననుండే ప్రవహించుచున్నది. కాని, వీటి రెంటిమధ్య వేఱుచేయు అవిద్యాభిత్తి యొండున్నది. అది యొకతరి బద్ధలైనచో, విశ్వాత్మను, విశ్వప్రకృతి చేతనను, అందు క్రీడించుశక్తులు మున్నగువానిని అత డెఱుంగు. అప్పు డతడు భౌతికపదార్థములను, అభిఘాత

ములను తాకి యెఱింగినట్లే, వీటి నెఱుంగ గలము. ఇవన్ని యు తన విశ్వాత్మతో నైక్యముగ నున్నట్లతఁడెఱుఁగును.

విశ్వమయ మనఃప్రాణ భౌతికప్రకృతి గలదు. వీటి శక్తుల వృత్తులనుండి యేరి తీసుకోబడినవి, వ్యష్టిగత మనఃప్రాణశరీరములు. ఈ మనఃప్రాణశరీర ప్రకృతి కావలనుండియే ఆత్మ వచ్చుచున్నది. అది పరాత్పరము నకు సంబంధించినది. అందువలననే, ఆవలనున్న పరా ప్రకృతికి, మన మున్ముఖులము గాగలము.

భగవానుఁ, డనేకత్వమయిన ఏకత్వము. జీవాత్మ ఏకత్వముయొక్క బహుత్వమందలి యంశము. భౌతిక తత్త్వమం దిచ్చట పరిణామార్థమై వెలువరింపబడినదే, చైత్యసత్త. మోక్షము బొందినపుడు జీవాత్మ తన్ను బహుత్వమైన ఏకత్వముగా నుపలబ్ధి గాంచుచున్నది. అది ఏకత్వములోనికి మునిగి దాని హృదయాంతరాళ మున లీనమైగాని మరుగువడిగాని యుండవచ్చును. ఇది అద్వైతపు లయస్థితి. అది తన ఏకత్వము ననుభవించుచు బహుత్వముయొక్క ఏకత్వముగా భగవంతుని అనుభ వింపవచ్చును. అదియే విశిష్టాద్వైతపు మోక్షము, అది తన బహుత్వాంశముమీఁద నొక్కిపలుకుచు నిత్య బృందావనములోని కృష్ణునితో క్రీడించుచుండవచ్చును.

అదియే ద్వైతపు మోక్షము. లేదా అది ముక్తిగాంచియు భగవల్లీలలోను, ఆవిష్కారములోను యుండవచ్చును, లేక తనకిష్టమైనన్ని పర్యాయము లావిష్కారములోని కవరోహింపవచ్చును. భగవానుడు మనోతత్వములచే బద్ధుడుకాడు, ఆయన తన లీలలోను మూలతత్వములోను స్వతంత్రుడు.

***

ప్రకృతి యనగా లోకముల నిర్మించి నడిపించెడి శక్తి లేక చిచ్ఛక్తియొక్క వెలుపలి అంశము; ఇదియే, లోకములను సృష్టించి, భరించునది. ఈ బాహ్యతత్త్వ మిచ్చట యంత్రోపమానముగను శక్తులయొక్కయు గుణాదుల యొక్కయు లీలగా నగుపడుచున్నది. దీని వెనుక భగవానుని జీవ చైతన్యము శక్తియునగు దివ్య శక్తియున్నది. ప్రకృతియే పరాపరములుగా విభజింపబడి యున్నది. అపరాప్రకృతి దైవమునుంచి విడదీయబడిన మనఃప్రాణశరీర అవిద్యా ప్రకృతి. పరాప్రకృతి, సచ్చిదానందముయొక్క దివ్యప్రకృతి. అది విజ్ఞానముయొక్క పరిణామశక్తితో కూడినదియు, ఈశ్వరుని నిరంతర మెఱిగినదియు అవిద్యనుండి తత్ఫలములనుండి ముక్తినొందినదియు నగు. మానవు డవిద్యయం దున్నంతకాలము

అపర ప్రకృతికి బద్ధుడే. కాని అధ్యాత్మ పరిణామము వలన పరాప్రకృతి నెఱిగి దానితో సంబంధముంచుకొన ఆశించు. అత డందులోని కారోహించగలడు. అదియు అతనిలోని కవరోహించగలదు. అట్టి యారోహణావరోహణములు మనఃప్రాణశరీరముల స్వభావమును పరివర్తన మొనరించ గలవు.

***

అతీతమనస్సవతరణమునకు ముందు అధిమనస్సునందుకొని దానిని క్రిందికి తేవలసియున్నది. ఏలన మనస్సునుండి అతీతమనస్సునకు ప్రవేశించుటకు, అధిమనస్సు మార్గము.

సత్యపదార్థసృష్టియొక్క సకలావస్థలును అదిమానసమునుండియే యుద్భవించుచున్నవి. అవి అధిమానసము నుండియే స్వతస్స్ఫురణమున, కనుగతములై, యందుండి మనబోధనార్థము తేజోమయ మన్సునకు యున్నత మనస్సునకు పంపబడుచున్నవి. కాని యవి అధోభూమికలకు వచ్చుకొలది వాటి గమనమున తమ శక్తిని సత్యమును అధికాధికముగ గోల్పోవుచున్నవి.

ప్రత్యక్షముగ గ్రహించియుండిన సత్యశక్తిని మర్త్యమనస్సునందు పోగొట్టుకొను. ఏలన మనబుద్ధి

కవి ఏదోఒకవిధమైన ఊహాభావములుగ కనబడుచు, ప్రత్యక్ష సత్యముగగాని ప్రత్యక్ష దృష్టిగగాని జీవవంతమైన దర్శనముగగాని నిరాకరింపరాని అనుభవముగగాని చూపట్టదు.

***

అతీతమనస్సు సచ్చిదానందమునకు, అపరసృష్టికిని మధ్యనున్నది. దివ్యచేతనయొక్క స్వయంనిర్ణయసత్యము దానిలోమాత్రము యున్నది. సత్యసృష్టి కదియవసరము.

మనఃప్రాణశరీర సంబంధములోకూడ సచ్చిదానందము నుపలబ్ధినొందనగును. కాని అపుడది తనసాధ్యముచే అపరప్రకృతిని భరించునట్టి స్థిరపదార్థమగునేకాని అపరప్రకృతిని పరివర్తన మొనరించునది కానేరదు; అపరప్రకృతిని పరివర్తన మొనరింప చేతనైనది అతీతమనస్సొక్కటియే.

***

త్రివిధావస్థలుగల ఏకత్వమే సచ్చిదానందము. పరమునందు అవి మూడుకావు, ఒక్కటియే యగు. సత్తయే చేతన, చేతనయే ఆనందము, అట్లవి అభేదములు, అంతియేకాదు, అవి యేమాత్రము వేరుగాని

ఏకత్వముగ నున్నవి. ఊర్ధ్వభూమికలలో ఆవిష్క రించునపు డవి త్రికమగుచున్నది. ఏకముగనున్నను, ఒకదానిని ముఖ్యముగను మూలాధారముగ నొనర్ప నగును. అది తక్కినవానిని నడపించగలదు. వస్తుతః గాకున్నను, అధోభూమికలలో, నవి విభిన్నముగనున్న ట్లగుపడు. అందువలన నొక్కటియే దృష్టిగోచరమయి నిశ్చేతనమును, బాధాయుతమును నగు యునికిగా, లేదా ఆనందరహితమైన చేతనగానో దానిని మన మెఱుంగుదుము. నిజస్థితిలో, అనుభూతిలో నీ విభేదము లేనిచో, బాధ, అజ్ఞానము, అసత్యము, మరణము, నిశ్చేతనమని మనుకొన్నది, ఇవన్నియు తమంతకు తా మభివ్యక్తమై యుండవు. జడముయొక్క విశ్వ నిశ్చేతననుండి, పరిమితము, బాధాయుతమునైన పరిణామ ముండియుండజాలదు.

***

# సమర్పణము, ఉన్మీలనము

మఱెవరికిని, మఱెద్దానికినిగాక, కేవలము భగవానునికే సంపూర్ణ ఆత్మసమర్పణము జేయుట, దివ్యజనని సంయోగముచే, సకలాతీతజ్యోతిని, శక్తిని, విశాలతను, శాంతిని, పవిత్రతను, విజ్ఞానమయ భగవానునియొక్క సత్య చేతనను, ఆనందమును, మనలో నిచ్చటికి, క్రిందికి, గొనివచ్చుటయే, ఈయోగముయొక్క పూర్ణతత్త్వము.

***

మహోన్నతమైన అధ్యాత్మికమాదిగా భౌతికము వఱకుగల, సత్తయొక్క సకలాంశములందును, కృత్స్నము సంపూర్ణము నగు భగవానునియెడ గల అత్యంతప్రేమ మగునట్టిదియు, అత్యంతాత్మసమర్పణమును సర్వసత్తా నివేదనమును గొనితెచ్చునదియు, తమోమయ జడ ప్రకృతికిని శరీరమునకును బరమానందము నాహ్వానించు నదియు, నగు దివ్యప్రేమమూర్తియే శ్రీరాధ.

***

భగవత్ప్రేరణ యొక్కటే తప్ప మఱేప్రేరణ మును బ్రతిగ్రహించకుండుటయే పవిత్రత.

***

భగవత్ప్రేరితములు, పోషితములునగు వృత్తులను మాత్రమే తప్ప మఱేవృత్తులను గైకొనకయు, అభివ్యక్త మొనరింపకుండుటయు, యనన్యవిశ్వాస మన బఱగు.

***

ఋజుత్వమనగా సత్తయొక్క సకలప్రవృత్తులను యిదివరకేపొందిన ఉత్కృష్టచేతనోపలబ్ధులస్థాయికి లేవ నెత్తుట.

పరమాత్ముని కేంద్రేచ్ఛయందు, సత్తయొక్క సకలాంశముల, వృత్తుల ఏకీకరణమును, అవిసంవాద మును, ఋజుత్వము శాసించును.

***

భగవానునికి తమ సర్వస్వమును, సర్వాంగముల యం దర్పించుకొనినవారికే, భగవానుడు ప్రసన్నుడగును. వారికే శాంతి, తేజము, శక్తి, ఆనందము, ముక్తి, విశాలత, జ్ఞానోచ్ఛ్రయములు, ఆనందసాగరములును.

***

ఆత్మసమర్పణమును గుఱించిన వట్టిమాటలు గాని, అభిప్రాయముగాని, నిస్తేజసమైన కోరికగాని, సంపూర్ణాత్మ నివేదన కుపకరింపవు. సమూలము సంపూర్ణమునగు మార్పుబొందుటకు ఆతురత గలుగవలయు.

ఈ పరివర్తనము, కేవల మనోవైఖరివలనగాని, బాహ్యపురుషుని మార్పునొందింపలేని యంతరానుభవములెన్ని యున్నప్పటికిగాని కొనసాగదు. ఉన్ముఖుడు కావలసినది, ఆత్మసమర్పణ మొనర్చుకొనవలసినది, పరివర్తన మందవలసినది ఈ బాహ్యపురుషుడేను. ఆతని యొక్క ప్రతిఒక, కనీసపుచేష్టయు, వృత్తియు, అలవాటుయు, దివ్యజ్యోతి కర్పింపబడి, కనపఱుపబడి, అందించబడి, తద్వారా, ప్రాతపద్ధతులు, సంకల్పములు నిర్మూలనమయి వాటిస్థానములో దివ్యసత్యము, దివ్యమాతయొక్క పరిణామచేతనాశక్తి ఆక్రమించుకొనుటకు గాను, దివ్యశక్తికి నివేదితము గావలెను.

***

నీయాత్మసమర్పణమును వెనుకకుతీసుకొన్నపుడు, 'మాత' కున్ముఖుడగుటలో నాధ్యాత్మికభావ మంతగా నుండదు. ఈయోగము నభ్యసించువారికి, ఆత్మార్పణము, సమర్పణము, విధియైయున్నది. వలన, సత్త

యొక్క అట్టి క్రమపరివర్ధమాన మగు సమర్పణము లేనిచో, గమ్యస్థానము నేమాత్రము సమీపించుటయు, కడు దుస్తరము. అభిముఖుడవైయుండుట యనగా, నీలో పనిచేయుటకు మాతృశక్తిని ఆహ్వానించుటయే. ఆ శక్తికి నీవు సమర్పణ మొనర్చనియెడల, నీలో నాశక్తి పని చేయుటకు నీవు బొత్తిగా నంగీకరించనట్లే యగును. లేదా, దివ్యసత్యపథమగు నాశక్తియొక్క స్వమార్గమున గాక, నీయిష్టమైన పద్ధతిలో నాశక్తి పనిచేయవలయు నను నియమముమీదమాత్రమే నీ వంగీకరించినట్లగును. ఇట్టిసూచన సాధారణముగా విరోధశక్తివలననో లేదా అనుగ్రహము లేని శక్తినేని యాశించెడు, మానసిక లేక ప్రాణికాహంకారాంశమువలననో కల్గి, భగవ దుద్దేశ మున కనుగుణముగా నుండుటకుగాక, తన స్వప్రయోజ నమునకు దాని నుపయోగించుటకు చేయబడినదగును; అది భగవానునినుండి బడయగలదానినంతను తీసికొనుట కిష్టపడును, గాని భగవానునికి తన్ను సమర్పించు కొనుట కిష్టపడదు. నిజసత్తయగు ఆత్మయన్ననో, భగవానునివైపునకు మరలి, తన్ను సమర్పించుకొనుట కిష్టపడుటయే గాక, ఆత్మసమర్పణముచేయుటకు ఆతు రత కల్గి సంతోషపడును.

ఈయోగమున, సాధకుడు, ప్రతిమానసికాదర్శ సంస్కృతిని మించిపోవుట భావ్యము. భావములు నాదర్శములును మనస్సుకు సంబంధించినవియు, ఖండ సత్యములుమాత్రమే యగును. మనస్సు తఱుచుగా కేవల మాదర్శముతోను, ఆదర్శము గావించుకొనుటలోగల సంతోషముతోను తృప్తిపడుచున్నది; ఇక జీవిత మన్ననో నిరంతర మొకేరీతిగానుండి, పరిణితి బొందక, స్వల్పముగామారి పైకి మారినట్లు కనబడుచు, యథాస్థితిలోనుండును. సత్యాన్వేషి యుపలబ్ధిప్రయత్నమును వీడి కేవల మాదర్శప్రాయుడగుటకు ప్రయత్నించడు. ఆదర్శప్రాయుడగుటయేగాక, దివ్యసత్యమును ఇహమందుగాని పరమందుగాని ఉపలబ్ధి నొందుటయే యాతని లక్ష్యము. ఇహమందే యైనచో, మనస్సును ప్రాణమును బరివర్తన మొనర్చుట అవసరము. దివ్యమాతృశక్తి యొక్క శరణ్యమువలనగాని యీమార్పు చేకూరదు.

నిర్గుణబ్రహ్మము నాశించుట, జీవితమునుండి పలాయనమగు వారిమార్గము. వీరు సాధారణముగా తమ స్వప్రయత్నమువలన సాధింపజూతురేగాని, యొక పరాశక్తికి తమ్ము నర్పించుకొనుటవలనగాని, ఉన్ముఖులగుటవలనగాని, కాదు. ఏలన, నిర్గుణబ్రహ్మము

దారిచూపునట్టిదికాని సాయపడునట్టిదిగాని గాక కేవల ము పొందదగినట్టిదిగా నున్నది. మానవుని స్వభావ సామర్థ్యము, ప్రవృత్తి, వీని ననుసరించి, దానిని చేరుట కది యవకాశ మిచ్చుచున్నది. అట్లుగాక, దివ్యశక్తి కున్ముఖుడై, ఆమెను శరణుజొచ్చుటవలన, ఈనిర్గుణ బ్రహ్మమునే కాక, సత్యముయొక్క ప్రతి ఇతరభాగ విశేషము నాత డుపలబ్ధి నందగలడు.

సమర్పణము క్రమక్రమముగా వృద్ధియగుట తప్పనిసరి. ప్రారంభమునుండి, పరిపూర్ణసమర్పణ మెవ్వరు నొనర్పజాలరు. అందువలన, తన్నుదా బరీక్షించుకొను నపు డాసమర్పణ భావముగానున్నట్లు గ్రహించుట సహజమే. సమర్పణతత్త్వ మంగీకరింపబడి, దానినెందుల కొకమెట్టునుండి మఱియొక మెట్టునకు, నొక భూమికనుండి మఱియొక భూమికకు క్రమక్రమముగా ప్రకృతియొక్క సకలాంగముల కన్వయింపజేసి, పూనికతో తీసికొనిపోనందులకు కారణ మగుపడదు.

***

సాధనయొక్క ప్రారంభదశ యందు,—ప్రారంభ దశ యనగా, నేదో స్వల్పకాలమని నా యభిప్రాయము కాదు—ప్రయత్నము తప్పనిసరి. సమర్పణము నట్లే;

కాని సమర్పణ మొక దినములో నలవడునది కాదు. మనస్సునకు కొన్ని భావము లున్నవి. వాని నది యంటి పట్టుకొనియుండును. మానవ ప్రాణసత్త సమర్పణము నెదిరించుచు, ప్రారంభదశలో, సమర్పణమని తాను చెప్పునదొక సందేహాస్పదమైన కోరికతో గూడిన సమర్పణమే యగు. భౌతికచేతనము రాయివంటిది. అది యను కొను సమర్పణము తఱుచు తమస్సుకంటె వేరు కాదు. చైత్యసత్త ఒక్కటియే సమర్పణ మెట్లొనర్చవలయునో ఎఱుంగును. ఆ చైత్యసత్త సాధారణముగా ప్రారంభ దశలో చాలవఱకు మఱుగుపడియుండును. చైత్యపురుషుడు మేల్కాంచినపుడు, సర్వసత్తయొక్క ఆకస్మికము, యథార్థమునైన సమర్పణము, నది, సమకూర్చగలదు. ఏలన, తదితర కోశములలోని కష్టము నివారింపబడి, తొలగుచున్నది. కాని, యంతవఱకు, ప్రయత్నము తప్పనిసరి. లేదా, పైనుండి దివ్యశక్తి యుప్పొంగి ప్రవహించుచువచ్చి, సాధనను గైకొని, స్వయంకృషికి అల్పావకాశము నిచ్చుచు, అధికాధికముగా తానే సాధననొనర్చుపర్యంతము, ప్రయత్న మవసరము. కాని, అప్పటికికూడ, మనస్సు, ఇచ్ఛ, ప్రాణశరీరములు, ఇవి భగవచ్ఛక్తికి సంపూర్ణముగా నధీనము లగువఱకు,

ప్రయత్నమునమాట యెట్లున్నను, అభీప్స, జాగరూకత, ఇవి అవసరములు. ఈ విషయమునుగుఱించి, 'మాత' యను గ్రంథమందలి యొకయధ్యాయమున వివరించియున్నాను.

మఱొకపక్షమున, సంపూర్ణ సమర్పణమునకై, నిష్కళంకము, తీవ్రము నగు సంకల్పముతో సాధన మొదలుపెట్టువారు కొందఱు గలరు. అట్టివారు చైత్య పురుషునిచే నియంత్రితులగువారుగను, లేదా సాధన యొక్క ధర్మముగా సమర్పణము నొకపరి యంగీక రించినప్పటినుండి, తద్విషయమైన యసందర్భ ప్రలాప ముల సరకుగొనక, సత్తయొక్క యితరాంశములను త న్నియతములకు లోనగునట్లు చేయు విశుద్ధమును ప్రకాశమునగు మనోసంకల్పముచే నియంత్రితులుగనో నున్నట్టివారుగ నున్నారు. ఇచ్చట ప్రయత్నమింక నున్నది. కాని, యది సంసిద్ధముగాను, స్వతఃసిద్ధము గాను, తత్ప్రయత్నము వెనుక మహత్తరశక్తి యొకటి యున్నదను భావముగలదిగాను, అందువలన, సాధకుడు తాను ప్రయత్నముచేయుచున్నానను భావమే లేనట్టిది గానున్నది. కాని, స్వతంత్రపోకడను బరిత్యజించుట కష్టమగునట్టిన్ని, స్వసంకల్పమును నిలుపుకొనవలయునని ఆశగల మనఃప్రాణములు కలవారిలో పెనుగులాట,

ప్రయత్నములనునవి, ముందున్న యుపకరణమునకును, వెనుకనో లేక పైననో ఉన్న దైవమునకు మధ్యగల గోడ పగిలిపోవువఱకు నుండితీరును. వ్యత్యాసము లేకుండ ప్రతి ఒకరికి నన్వయించుసూత్రము విధించుటకు వీలుపడదు. మానవస్వభావమందలి వ్యత్యాసములు పెక్కులుగనుక నొకే కఠినసూత్ర మెల్లర కన్వయించదు.

***

సాధకుడు తనలోవర్తించు దివ్యశక్తిని, లేదా తద్వర్తనా ఫలితములను గుర్తించగల్గినవాడై, తన స్వకీయ మనోపరివృత్తులచేతను, ప్రాణమయ కలతల చేతను, భౌతికమగు తమోమాంద్యముల చేతను, నా దివ్య శక్తియొక్క యవరోహణమును, తత్ప్రక్రియను నిరోధించని, యొకస్థితి నందగలడు. అదియే ఈశ్వరోన్మీలనము. ఉన్మీలమునకు యుత్తమమార్గము సమర్పణము. కాని సమర్పణము లేనంతవరకు అభీప్స, స్థిరత, శాంత వర కుపకరించును. ఆత్మసమర్పణ మనగా, తనలోని సర్వస్వమును ఈశ్వరార్పణము చేయుటయు, తనది తన కున్నది సకలము సమర్పించుటయు, తన భావములు, వాంఛలు, అలవాటులు మున్నగువానిపై పట్టుదల వహించక, వీని స్థానమును, దివ్యసత్యము తదిచ్ఛాజ్ఞాన

క్రియలచే సర్వత్ర పూరించుట కనుమతించుటయు నగు.

***

నిరంతరము భగవచ్ఛక్తి నంటియుండుము. తిన్నగా నట్లుచేయుట, ఆ దివ్యశక్తి నీలో తనకార్యము నొనర్చుట కంగీకరించుట,——ఇదియే నీకు యుత్తమ మార్గము. అవసరమైనపుడెల్ల ఆశక్తి యవరశక్తులను వశపఱచుకొని, వానిని విశుద్ధ మొనర్చును; ఇతర సమయములలో నీనుండి వానిని తొలగించి తనచేతనే నిన్ను నింపును. కాని, నీమనస్సున కాధిపత్యమునిచ్చి, నీలో నేది కర్తవ్యమో విచారించి నిర్ణయించుటకు దాని కనుమతిచ్చినయెడల, దివ్యశక్తితోటి సంబంధమును నీవు బోగొట్టుకొందువు. అట్టితరి, నిన్ను శక్తులు తమ యిష్టానుసారము నడుప మొదలిడి, సర్వము గందర గోళములోనికి, కుత్సితప్రవృత్తిలోనికి దించును.

***

సాధకుడు తన సాధనలో ప్రాణమయవాసనా మిశ్రమమును బోగొట్టుకొని 'మాత' కవ్యాజము హృదయపూర్వకమునగు నాత్మసమర్పణ మొనర్ప సమర్థుడైనపుడే, చైత్యసత్త సంపూర్ణముగా విచ్చుకొని ప్రకాశించగలదు. ఏవిధమైన అహంప్రవృత్తిగాని,

కృత్రిమో దేశికముగాని యున్నచో, ప్రాణమయవాసనల ప్రోద్బలముచేగాని, లేదా పాక్షికముగనో యేదో యాధ్యాత్మిక, లేక తదితర ఆశ, గర్వము, స్వోత్కర్ష, వీనిని తృప్తిపఱచుటకుగాని, అధికారము, పదవి, ఇతరులపై పలుకుబడి వీనిని తృప్తిపఱచుటకుగాని, లేదా యోగశక్తి సాహాయ్యమున నేదో ప్రాణిక కామవాసనా సంపూర్తికొఱకు నుద్వేగముతోగాని యోగ మొనర్చిన యెడల, చైత్యసత్త ఉన్మీలనము గాజాలదు. ఒకవేళ ఉన్మీలనమైనను, పాక్షికము, తాత్కాలికముగామాత్రమే యుండి ప్రాణిక, క్రియాకలాపముచే నాచ్ఛాదితమైనందున, నిమీలితమగును. ఊపిరాడనీయని ప్రాణమయ పొగలో చైత్యాగ్ని రగుల్కొనక విఫలమగును. మఱియు, యోగములో మనస్సు ప్రాధాన్యము వహించి యంతరాత్మను వెనుకకు నెట్టివేసెనేని, లేదా, భక్తి తదితర ప్రవృత్తులు చైత్యరూపము దాల్చుటకుబదులు, ప్రాణమయ ఆకారము వహించెనేని, అసమగ్రత ప్రాప్తమగును. పవిత్రత, కేవల ఋజువర్తనము, కృత్రిమము లేనట్టియు, ఆశారహితమగునట్టియు, నహంకారరహిత పరిశుద్ధాత్మ సమర్పణాసామర్థ్యము ననునవియే చైత్యసత్తయొక్క పరిపూర్ణోన్మీలనమున కుపాయములు.

***

హృదయమును శుష్కింపజేయుట ఈయోగము యొక్క యుద్దేశ మెప్పటికిని కాదు. కాని, భావములను భగవానునకేసి మరల్పవలయును. హృదయము నిశ్చలమై, సామాన్యభావములనుండి వైదొలగి, ఊర్ధ్వము నుండి లోనికివచ్చు ప్రవాహమునకు నిరీక్షించియుండు సమయములు స్వల్పముగా నుండవచ్చును. కాని యట్టి స్థితులు శుష్కావస్థలుగాక, నిశ్చలము, శాంతియుతమగు దశలుగా నున్నవి. చేతన ఊర్ధ్వగామిని యగువఱకు యోగమునందు, హృదయమే, నిజస్థితిలో ఏకాగ్రతకు ముఖ్యకేంద్రస్థానముగ నున్నది.

***

అనురాగమంతయు, సాధనకంతరాయమే. అందరిపట్ల, సదిచ్ఛ, చైత్యసంబంధమైన దయ, నీవు కల్గియుండవలసినదే, కాని కామనాయుతప్రాణికసంగమ ముండగూడదు.

***

సాధకుని ప్రేమ భగవానునికొఱకే యుండవలయును. అతనికది పరిపూర్ణముగా నున్నపుడే, యితరులనాత డుచితరీతి ప్రేమించగలడు.

***

ప్రాణమయ, భావమయ, శరీరమయ కోశముల ద్వారా దివ్యశక్తిని గ్రహించినట్లు, బుద్ధిద్వారాకూడ ఏల గ్రహించరాదో కారణ మగుపడదు. వీనితో సమానముగా బుద్ధియు గ్రహణసామర్థ్యముగలదే. తక్కిన ఉపకరణములవలె బుద్ధియు బరివర్తనము గావలసియున్నదికాన, సక్రమముగా దివ్యశక్తిని గ్రహించుటకది యలవరింపబడవలెను. లేకున్న దాని పరివర్తనము కలుగజాలదు.

సామాన్య సంస్కారరహిత ప్రాణమయ క్రియాకలాపము, దేహసంబంధమైన, అప్రకాశమగు బాహ్యప్రతిరోధనా చేతనము, అధ్యాత్మికానుభూతికి అంతరాయములైనట్లే, బుద్ధియొక్క సహజమును అప్రకాశము నగు క్రియాకలాపము సహితము దివ్యానుభూతికి అంతరాయమే యగుచున్నది.

బుద్ధియొక్క పెడత్రోవలనుండి తప్పించుకొనుటకు సాధకుని ముఖ్యముగా హెచ్చరించవలసిన దేమన: మొదటిది, బుద్ధిబలమున కల్గిన సారాంశములను, మనోభావములను సంస్కారములను, ఉపలబ్ధిగా నెంచి, యే విధముగాకూడ పొరబడకుండుట ; రెండవది, చైత్యాధ్యాత్మికానుభవముల సహజ సమంజసమును గలత

పఱచునట్టియు, యథార్థభాసమాన మగు జ్ఞానమును క్రిందికివచ్చుట కవకాశ మియ్యనట్టియు, మానవ మనో కోశము నంటినంతమాత్రముననే గాని, పూర్ణముగా దాని నంటకమునుపేగాని, వికృతినొందునట్టియు, మనో వ్యాపార చాంచల్యమునుగుఱించి హెచ్చరిక గల్గి యుండుట. ఇవిగాక, బుద్ధికి సంబంధించిన సహజ దుర్గుణ ములుకూడ కలవు. అవేవన, శాంతియుత ప్రకాశమాన మగు వివేచనయు, దీప్యమాన గ్రహణశక్తియు, వీటికి బదులు, నిర్వీర్యమగు సంశయముల పాలగుట; తన కతీతమైనట్టియు, తనకు తెలియనట్టియు, తనకు మిక్కిలి యఘాతమైన విషయములపైన తన స్వీయపరిమితాను భవ పరిమాణముతో విమర్శింపగలనను దాని దురహం కారము; భౌతికమున కతీతమగుదానిని భౌతికముచే విశదీకరింపబూనుదాని ప్రయత్నములు; పరవిషయము లను, గుప్త రహస్యజ్ఞాన యాథార్థ్యమును, జడప్రమాణ ములచేతను, జడమునందలి మనస్సుకు యుక్తమైన ప్రమాణములచేతను ఋజువుపఱచవలెనని వాదించుట; ఇటువంటి వెన్నియో లెక్క చెప్పనలవిగాని యితరదుర్గుణ ములు కలవు. నిరంతరమది యథార్థజ్ఞానమునకు బ్రత్యా మ్నాయముగా తన సంకల్పనలను, భావములను, పోక

డలను యేర్పరుచుచుండు. కాని, బుద్ధి, సమర్పితమై, అభిముఖమై, నీరవతనై, గ్రహణశక్తిగలదైనచో, నది తేజోధారణమున కొక మార్గముగను, అధ్యాత్మిక దశానుభవమునకును, అంతఃపరివర్తనా పరిపూర్తికి సాయకారిగా నేలకాకూడదో, కారణ మగుపడదు.

***

నీరవత, శాంతి, పరిపూర్ణమగుట కనువుగా, కామనముయొక్క ప్రాణవ్యాపారమును బోలె మనో (బుద్ధి) వ్యాపారముయొక్క సంక్షోభమునుగూడ నిశ్చల మొనర్చవలసియున్నది. జ్ఞానము ప్రసన్నము కావలయు; కాని యది ఊర్ధ్వమునుండి రావలయు. ఈ ప్రశాంత స్థితిలో, సామాన్యప్రాణవ్యాపారములవలె, సాధారణ మనోవ్యాపారములును, నిశ్చలాంతరాత్మకు నెట్టిసంబంధము లేనివై, బాహ్యవ్యాపారము లగుచున్నవి. యథార్థజ్ఞానము సత్యజీవనకార్యకలాపమును యవిద్యా ప్రవృత్తులను త్రోసిపుచ్చి, వీటిని పరివర్తనమొనర్చుటయు ముక్తి కవసరములు.

***

చైత్యసత్త, దివ్యసత్యముతో సాక్షాత్సంబంధము గలిగియున్నది. కాని యది మనస్సుచేత, ప్రాణసత్త

చేత, భౌతికప్రకృతిచేత, మనుజునందు మఱుగుపడి యున్నది. యోగ మభ్యసించి, మనోబుద్ధులందు జ్ఞాన ప్రకాశములను బడయవచ్చును. శక్తిని వశపఱచుకొని నానా విధానుభవములతో గూడ నెలకొల్పవచ్చును; కాని వెనుకనున్న నిజమైనఆత్మశక్తి యావిష్కరింపకున్న యెడల, చైత్యప్రకృతి ముందుకురాకున్నయెడల, యథార్థ మైనదేదియు నొనర్పబడదు.

ఈ యోగమునందు, యథార్థవిజ్ఞాన జ్యోతికిని, తుదకు పరమానందమునకు, సత్తాయందలి ప్రకృతి విశేషము నంతటిని బాహాటమొనర్చునదియే చైత్యసత్త. మనస్సు స్వాయముగా తన స్వోన్నతధామముల కున్ముఖము గాగలదు. అది తనంత తా నిశ్చలతనుండి నిర్గుణ బ్రహ్మములోనికి విస్తరించుకొనగలదు. అది యొకానొక నిర్వికార మోక్షమునందో, నిర్వాణమునందో ఆధ్యాత్మికత బొందవచ్చును. కాని, కేవల మధ్యాత్మికమనస్సునందే, తగు పునాదిని, అతీతమనస్సు గాంచగలదు. అంతరాత్మను మేల్కొలిపినపుడును, కేవల మనఃప్రాణ శరీరములనుండి చైత్యచేతనలోనికి పునర్జన్మ నందినపుడును, నీయోగమును సాధింపనగును. లేకున్న, కేవలము మనస్సుయొక్కయు, సత్తాయొక్క యితరాంశము

యొక్క బలము వలనను, యిది సాధింప నసాధ్యము. మేధాజ్ఞానము, మనోభావములు, ప్రాణమయకోరిక, వీని యందుగల మమకారముచే, చైత్యపునర్జన్మమునకును, దివ్యమాతనుండి నూత్నముగా యుదయించు శిశువగు టకును, తిరస్కరించినయెడల, సాధనలో అపజయము గలుగును.

***

ఊర్ధ్వావరోహణముననే, శాంతి, నిశ్చలతలు ప్రాప్తమగుట కత్యంతయాథిద్మైన మార్గమని నేను చెప్పి యున్నాను.

పైకట్లగుపడకున్నను, నిజముగా నవి వచ్చునది, ఆవిధముననే, సాధకుడుకూడ సాధనక్రమమును గుఱించి నిరంతర మెఱుకగలిగియుండడు. శాంతి తనలో నెలకొను చున్నట్లో, అథవా యావిష్కరించుచున్నట్లో యాతనికి తోచుచుండును. కాని, యది యేవిధముగా నెచ్చట నుండి వచ్చుచున్నదియు నాతనికి తెలియదు. అయినను, సత్యమేమన, ఊర్ధ్వచేతనకు సంబంధించిన దంతయు, పైనుండియే ప్రాప్తించు. అధ్యాత్మిక శాంతి, నీరవతమేగాక, జ్యోతి, శక్తి, జ్ఞానము, పరదృష్టి, చింతనము, ఆనందము, యివన్నియు పైనుండియే వచ్చును.

అవి కొంతమేరవఱకు లోనుండియే రావచ్చుననుట గూడ సాధ్యమే. కాని, యిది యేలన, చైత్యసత్త వానికి ప్రత్యక్షముగా నున్మీలనమగుటవలన, అవి మొదట నచ్చుటికివచ్చి, యావల చైత్యసత్తనుండియో, లేక యది ముందునకు వచ్చుటమూలముననో, సత్తయొక్క తదితర భాగములలో తమ్ముతాము వెలువరించుకొనును. లోపలనుండి వికాసము, పైనుండి యవరోహణము, ఈ రెండే యోగసిద్ధికి రాజమార్గములు. బాహ్యమనోభావములతోటి సాధనాప్రయత్నము, యిదిగాక, యేదో ఒకవిధమైన తపస్సు, యివి కొంత తోడ్పడవచ్చు, కాని పై ద్వివిధ మార్గముల ఫలితముతో పోల్చిచూచిన, సాధారణముగా నివి యనిశ్చితములు నసమగ్రములుగా నుండును. అందువలననే, ఈయోగమందు 'ఉన్మీలనము' అత్యవసరమని మేముచెప్పుచున్నాము. అంతర్మనఃప్రాణ శరీరములను, మనలోని నిగూఢకక్ష్యయగు చైత్యసత్తకు నంతర్ముఖముగా నున్మీలన మొనర్చుటయు, మనస్సున కూర్ధ్వముననున్నదానికి ఉన్మీలనమొనర్చుటయు, సాధన సిద్ధికి తప్పనిసరి.

దీనికి మూలకారణ మేమనగా, 'మనము' ని పేర్కొను ఈయల్పమనస్సు, ప్రాణము, శరీరము, ఇవి

కేవలము బాహ్యతల వర్తనములే గాని, మనఆత్మ యెంతమాత్రమును గాదు.

అవిద్యాలీలకొఱకు క్షణభంగురమైన జీవుని యొక్క బాహ్యాంశమే, యది. అది పాక్షికసత్యముల నన్వేషించుటలో తడబడు మూఢమనస్సుతోను, కించిత్ భోగవిలాసమునకై పరుగులిడు మూఢప్రాణముతోను, విషయాభిఘాతములనందుచు, తత్ఫలితములగు కష్టసుఖముల సహించుటకుమారు వానిచే బాధపడుచుండునట్టి యస్పష్టము, నత్యంతయథశ్చేతనమునగు భౌతికముతోడను సిద్ధముచేయబడినది. మనస్సువిసుగుజెంది తన్నుగుఱించి, తన విషయములగుఱించిన యథార్థసత్యము నన్వేషింప నారంభించునంతవఱకును, ప్రాణము జుగుప్స నొంది యథార్థానందమనునది యొకటి లేదాయని యబ్బురపడ నారంభించునంతవఱకును, భౌతికము అలసిపోయి తననుండి తన కష్టసుఖములనుండి విమోచనమును గాంక్షించువఱకును, దానినంతను ఒప్పుకొనవలసినదే. అటుతరువాతనే, వ్యక్తియొక్కయజ్ఞానయుతమగు స్వల్పాంశము తన నైజసత్తాను మరల బొందుటకునూ, తన్మూలమున ఈమహత్తరవిషయముల గాంచుటకో, లేదా తాను లయమై నిర్వాణముచేరుటకో, సాధ్యమగును.

సదాత్మ ఉపరితలమునం దెచ్చటనోగాక, లోన నతిగూఢముగను, ఊర్ధ్వముననుగలదు. విషయముల యొక్క యాదార్థ్యముతోటి ప్రత్యక్షసంబంధము, జగదానందముపట్ల యభిరుచి, స్థూలభౌతికశరీరము యొక్క యల్పత్వ-యాతనలనుండి విముక్తి, మున్నగు నీ వాసించు విషయములను గ్రహించుటకు సామర్థ్యము గాంచియున్న, అంతర్మనఃప్రాణ భౌతికముల భరించు ఆత్మ, లోనయున్నది. ఐరోపాదేశమునగూడ, యేదోయొకటి, యుపరితలమునకు, వెనుక నున్నదను విషయమిప్పుడు విశేషముగా పలువురు అంగీకరింపబడుచున్నది. కాని దాని తత్త్వనిరూపణమున బొరపడుచు, అధశ్చేతనమనియో, అంతఃశ్చేతనమనియో అది పేర్కొనబడుచున్నది. వాస్తవస్థితిలో నదియొకవిధముగా ప్రజ్ఞాయుతమై, అధఃశ్చేతనముగాక యాచ్ఛాదితమై యున్నది. అది మన మనోతత్త్వశాస్త్రము ననుసరించి యోగాభ్యాసమువలన మన మెఱుగగల చక్రములవలన, స్వల్పమగు బాహ్యపురుషునితో సంబంధింపబడియున్నది. ఈ చక్రములద్వారా ఆంతరికసత్తయొక్క యే స్వల్పమో బాహ్యజీవనములోనికి తప్పించుకొని వచ్చుచున్నది. కాని, యీస్వల్పమే మనయొక్క శ్రేష్ఠాంశమయి, మన

కళకు, కవిత్వమునకు, తత్త్వమునకు, భావములకు, మతాశయములకు, జ్ఞానము, సిద్ధి వీటిపట్లచేయు ప్రయత్నములకు, కారణమగుచున్నది. కాని లోపలి చక్రములు చాలమట్టుకు నిమీలితములై నిద్రితములై యున్నవి. వాని నపావృతమొనర్చుట, వానిని జాగరూకములుగా నొనర్చి కార్యకారులుగా జేయుట, ఇది, యోగముయొక్క యొకలక్ష్యము. అవి యున్మీలన మగుకొలది, అంతస్సత్తయొక్క శక్తులు, సాధ్యతలు గూడ మనలో వికసితములగుచుండును. మొదట మన మొక మహత్తర చేతనలో, నావల విశ్వచేతనలో మేల్కాందుము. మన మపుడు పరిమిత జీవితములుగల క్షుద్రమును ప్రత్యేకమునగు వ్యక్తులముగాక విశ్వకార్య కలాపముల కేంద్రములమై విశ్వశక్తులతో ప్రత్యక్ష సంబంధము గలిగియుందుము. ఇంతియగాక, బాహ్య పురుషునివలె ఆ శక్తుల కయిష్టమగు క్రీడోపకరణము లుగా నుండుటకుబదులు, తత్ప్రకృతిఖేలనమును గొంత వఱకు గుర్తెఱింగినవారముగను దాని అధిపతులుగను గాగలము. దీని అభివృద్ధి,ఆంతరికసత్తయొక్క పరిణామాభి వృద్ధిని బట్టియు, నది యున్నతతర ఆధ్యాత్మికభూమికల వైపు యూర్ధ్వముగా, వికాస మొందుటను బట్టియు,

నాధారపడియుండును. ఆ దేసమయమున, హృదయస్థాన చక్ర మున్మీలనమగుటవలన, చైత్యసత్త బహిర్గతమయి, తద్వారా మనలోని భగవానుడును, మనపైనున్న చరమసత్యమును గోచరించును.

ఏలన, పరమాత్మ, మనవ్యక్తిత్వ దేహస్థితుల వెనుకగూడలేదు, కాని, వానికిపైన నున్నది, మఱియు, కేవలము వాని కతీతముగానున్నది. అతని గూఢమైన చక్రము హృదయకమలమునం దున్నట్లె, అంతఃచక్రములలో నుత్తమమైనది శిరస్సునం దున్నది. కాని యాత్మకు ప్రత్యక్షముగా నున్మీలితమగుచక్రము శిరస్సు పైనున్నది, అది స్థూలశరీరమునకు కేవలము వెలుపలను, సూక్ష్మశరీరమని పిలువబడుదానిలోపలను యున్నది. ఈయాత్మకు రెండవస్థలుగలవు. దీని నుపలబ్ధిబొందు ఫలములీ రెండవస్థల ననుసరించి యుండును. ఒకటి అక్షరమును, విశాలశాంతి ముక్తి నీరవతలతో కూడినదశ. ఈ అక్షరబ్రహ్మ మేవిధమైన కర్మచేగాని, తగులువడకుండును. అది కూటస్థముగ వాని కాశ్రియమిచ్చుచు, వానిని యుత్పత్తిచేయు నట్లేమాత్రము గనుపడదు. అది నిర్లప్తముగనో యుదాసీనముగనో యున్నట్లుండును. ఇంకొకటి క్రియాన్వితక్షరబ్రహ్మము. అది సకలవిశ్వ

క్రియాకలాపమునకు ఆదరువగుటయేగాక, ఈప్రపంచ మును, ఇతర సకల ప్రపంచములను, విశ్వముయొక్క భౌతికకక్షులతోబాటు, పరభౌతికములను, వీనినన్నిటి నుత్పత్తిజేసి, తనయందు నెలకొల్పుకొనుచున్నది. ఆత్మ నన్నింటిలో నొకటిగా మనము భావింతుము. కాని యీయాత్మ నన్నింటికంటె అతీతముగను, పరా త్పరముగను, జన్మరాహిత్యముగను, విశ్వస్థితి కతీతము గను గూడ మనము తెలిసికొందుము. అన్నిట నేకముగ నుండు విశ్వబ్రహ్మము జేరుటయన, అహంకారవిముక్తి నందుటయగును. అపు డహము చేతనలో నొక స్వల్పోపకరణ స్థితిగ నగుచున్నది; లేదా మన చేతన నుండి సాంతముగా లయమగుచున్నది. అదియే అహం కార నిర్వాణము. సర్వాతీతమగు పురుషోత్తమస్థితి జెం దుటచే, విశ్వచేతనమును, విశ్వక్రియా కలాపమును గూడ సంపూర్ణముగ నతిక్రమించగల సమర్థత కలుగు. లయము, మోక్షము, నిర్వాణమని పేర్కొనబడు ప్రపంచస్థితినుండి పూర్ణముక్తికి అదియే మార్గము గాగలదు.

ఊర్ధ్వోన్మీలనము, శాంతి నీరవతలకు, నిర్వాణము నకు, మాత్రమే అవశ్యముగ, త్రోవచూపునని అనుకొన

రాదు. మనపై, మన శిరస్సుపై, సకలభౌతిక, భౌతికా తీత ప్రదేశములలో వ్యాపకమగు నొకమహత్తరము, నొక నఖండము నగు శాంతి, నీరవత, విస్తృతి, వీనినేగాక, తదితరమైన, సకలశక్తుల కాధారమగు నొక మహాశక్తిని, సకలజ్ఞానముగల నొక యనంత తేజస్సును, సకలానంద పరవశతలుగల భూమానందము ను, సాధకు డెఱుగును. ప్రథమమున నవి అనియతము గను, అత్యంతికముగను, కేవలము, నైన ఏదోయొకటి గా తోచును. వీనిలో దేనిలోనికైనను నిర్వాణము సాధ్యముగా కనబడుచున్నది. కాని, ఈశక్తిలో నన్ని శక్తులు, ఈ తేజస్సులో నన్ని తేజస్సులు, ఈయానంద ములో సంభావ్యమైన సకల సంతోషానందములు, నున్నట్లుగూడ మనము గాంచగలము. ఇవన్నియు మన లోకి అవరోహించగలవు. కేవల మొకశాంతియేగాక, వానిలో నేవేనిగాని, అవియన్నియుగాని క్రిందికి రాగల వు. కాని, భద్రమైన మార్గమేమన, శాంతి నిశ్చలతను మొదట క్రిందికి గొనివచ్చుటయే. ఎందుకన, తక్కిన వాని యవరోహణము నది మఱింత భద్రమొనర్చును. లేకున్న, అంతటిశక్తిని, తేజస్సును, జ్ఞానమును, లేక ఆనందమును భరించుటకుగాని, ధారణజేయుటకు గాని,

సత్తాయొక్క బాహ్యస్వభావమునకు కష్టముగా నుండ వచ్చును. ఇవన్నియు గలిసి మన మనుకొను దివ్యచేత నను సమకూర్చును. హృదయమూలకముగా ఫలించిన చైత్యోన్మీలనము మనలను ముఖ్యముగా జీవాత్మతో నైక్యమొనర్చుచున్నది. అది ప్రేమభక్తులకు ముఖ్య ముగా జన్మస్థానము. ఊర్ధ్వోన్మీలనము కృత్స్నదైవ ముతో ప్రత్యక్షసంబంధమును గలిగించి మనలో దివ్య చేతనను, నవజన్మమును, దివ్యజన్మలను నెలకొల్పగలదు.

శాంతి స్థాపితమైనపుడు, పరమగు నాదివ్యశక్తి మనలో నవతరించి, పనిచేయగలదు. అది సాధారణ ముగా మొదట శిరస్సునం దవరోహించి, యంతర్ మనః కేంద్రముల విముక్తమొనరించు. ఆవల హృదయ చక్రములోనికి దిగి, చైత్యసత్తను, భావమయసత్తను, సంపూర్ణముగా ముక్తమొనర్చును. తదనంతరము నాభి కమలమును ఇతరప్రాణమయ చక్రములలో నవరో హించి, లోనిప్రాణికమును బంధవిముక్తము గావించి అటుపిమ్మట మూలాధారమును, దానిక్రిందిచక్రముల నవరోహించి అంతఃస్థితభౌతికసత్తను ముక్తమొనర్చు ను. అది యేకకాలముననే, సిద్ధితోబాటు ముక్తికిని పని చేయును. అది సత్తాలోని సమస్త స్వభావమును

కొంచెము కొంచెముగా గైకొని త్రోసివేయవలసినదానిని త్రోసివేసి, శుద్ధిచేయవలసినదానిని శుద్ధిచేసి, సృష్టించవలసినదానిని సృష్టించి, వ్యవహరించుచున్నది. అది సాధకుని ప్రకృతిలో సంకలనమొనర్చుచు, పరస్పరము మేళవింపజేయుచు నూతన లయను స్థాపించుచున్నది. అది యధికాధికమైనశక్తిని పరాప్రకృతియొక్క ప్రణాళికనుగూడ క్రిందికి తీసికొనిరాగలిగి, తుదకు, సాధన లక్ష్యమదియేయైనయెడల, అతీతమానవశక్తిని, అతీత మానవస్థితిని క్రిందికితేగల్గును. హృదయకమలములోని చైత్యసత్త్వయొక్క కార్యకలాపమువలననే, ఇదంతయు సంసిద్ధమొనర్పబడి, సాహాయ్యముచేయబడి, కొనసాగుచున్నది. అది యెక్కువగా వికసించుకొలది, శక్తియొక్క వ్యాపారమును, ప్రత్యక్షముగా, చుఱుకుగా, త్వరగా, భద్రముగా, సుళువుగా, నుండగలదు. హృదయమంతెక్కువగా ప్రేమ, భక్తి సమర్పణము లధికములగుకొలది, సాధనవికాసము మఱింత శీఘ్రము శుద్ధము నగుచున్నది. ఏలన, అవరోహము, పరివర్తనము రెండును, ఏకకాలముననే భగవానునితోటి ప్రవర్ధమానమైన సంబంధమును, ఐక్యమును సూచించును.

అదియే సాధనయొక్క ప్రధానమైన సహేతుక

తత్త్వనిర్ణయము. వానికి వెనుకను పైనను ఉన్నదాని కంతకును హృదయకేంద్రముయొక్క యున్మీలనము మనోచక్రముయొక్క ఉన్మీలనము, ఈరెండే యిచ్చట ముఖ్యవిషయములని స్పష్టమగును. హృదయకేంద్రము చైత్యపురుషున కున్మీలన మగును. మనోకేంద్రములు ఊర్ధ్వచేతన కున్మీలనమగును. చైత్యపురుషునకు, పర చేతనకు మధ్యగల సంధానుబంధమే సిద్ధికి ముఖ్యోపా యము. హృదయమం దేకాగ్రతతో ధ్యానించుటవలన, మనలో నావిష్కరించుటకును, చైత్యపురుషుని ద్వారా సమస్తప్రకృతిని జేకొని నడిపించుటకును, భగవానుని ప్రార్థించుటవలన, సాధనలో ప్రథమోన్మీలనమును, సిద్ధించును. ఈసాధనభాగములో ముఖ్యమైన సహకారులు, అభీప్స, ప్రార్థన, భక్తి, ప్రేమ, ప్రపత్తులు. ఇందు లకుతోడుగా, మనమాశించు వానికన్నింటి కడ్డుతగులు సర్వమునుతిరస్కరించుట అవసరమైనది. శిరస్సున చేతనను ఏకాగ్రముగ నిలుపుటవలనను, పిమ్మట శిరస్సుకావలను సత్తలోనికి దివ్యశాంతి, శక్తి, తేజస్సు, జ్ఞానము, ఆనందము వీని యవరోహణమునకైన స్థిరసంకల్పమువలనను, అభీప్స వలనను, సాధనలో ద్వితీయోన్మీలనము సిద్ధించును; మొదట శాంతిని, లేదా శాంతిశక్తులు రెండింటిని

ఆశింపవలయు, కొందఱు మొదట వెలుగునో లేదా ఆనందమునో లేదా ఆకస్మికజ్ఞానప్రవాహమునో బడయుదురు. ఇంకను కొందఱిలో మొదట నున్మీలనము సిద్ధించును. దానితో వారికి మహత్తరము ననంతమునగు శాంతి, శక్తి, జ్యోతి, లేదా వానికిపైనయున్న ఆనందము వెల్లడియగును. ఆవల వారందులోనికి నారోహింతురు. లేదా యివన్నియు నిమ్నప్రకృతిలోనికి నవరోహింప మొదలిడును. మఱికొందఱి విషయమున, మొదలు శిరస్సులోనికి, ఆవల క్రిందిహృదయభాగమునకు, తదనంతరము నాభిలోనికి, ఆపై సమస్త శరీరములోనికి అవరోహణమొనగూడును. లేదా అవరోహణ భావమేమియు లేకనే, శాంతి, జ్యోతి, విస్తృతి, లేక శక్తి, వీనియొక్క వివరించ వీలులేని యొకఉన్మీలనము కలుగును; లేదా విశ్వచేతనలోని కొక సమతలమగు ఉన్మీలనము కలుగును; లేదా, ఆకస్మికముగ విస్తృతమైన మనస్సులో జ్ఞానవిజృంభణము కల్గును. సాధకుని కేది లభించినను హృదయపూర్వకముగ స్వీకరింపవలసినదే, ఏలన, అందరికిని విధాయికమైన నియమము లేదు. కాని, మొదట, శాంతము చేకూరనిచో, సంతోషముతో నుబ్బి తబ్బిబ్బులుగాకుండ, సమతను జారగొట్టుకొనకుండ జాగరూకతతో మెలగవలసి యున్న

ది. దివ్యశక్తి అనగా మాతృశక్తి ఆధారములో నవతరించి కార్యనిర్వహణమునకు గడంగినపుడే, సాధనలో ఉత్తమ గతి చేకూరును. ఏలన, అప్పుడే, చేతనాప్యూహము, మహత్తర యోగపునాది ప్రారంభమగును.

ఏకాగ్రతయొక్క ఫలితము సాధారణముగా వెంటనే కలుగదు. కాని, కొందఱ కతిశీఘ్రముగా నకస్మాత్తుగా నిది ఫలప్రదమగును. కాని పెక్కండ్ర విషయమున, సరిగా సర్దుబాటుచేసికొనుటకు స్వల్పకాలమో, బహుకాలమో పట్టును; ముఖ్యముగా వారి ప్రకృతి, కొంత వరకు అభీప్సా తపస్సులచే సంసిద్ధము కానియెడల అట్లేర్పడును. ప్రాచీన యోగ విధానములలో నొకదానితో ఏకాగ్రతను సంధించుటచే, ఫలప్రాప్తికి తోడ్పాటు కలుగుచుండెడిది. అద్వైతజ్ఞానమార్గ మొకటి కలదు. "నేను మనస్సుగాదు, ప్రాణముకాదు, శరీరముకాదు" అని ఆద్వైతవేదాంతి నిరంతరము నుడువుచు, యివన్ని తన కంటె వేఱైనవని వీక్షించుచు, వీనితోటి ఐక్యత విడనాడుటచే, కొంతకాలముతరువాత, సకలమనఃప్రాణశరీర ప్రక్రియలు, మనఃప్రాణ శరీరముల గుఱించిన అసలు భావము వెలివైపోవునట్లును, బాహ్య వ్యాపారమైనట్లును, అతడు భావించుచు, ఈస్థితిలో నంతఃస్థితముగా

వానినుండి విడివడి, విశ్వ, విశ్వాతీతాత్మోపలబ్ధులలోనికి విప్పుకొను నొక ప్రత్యేకమును, స్వయంభువు నగునట్టి సత్తాభావము అతనిలో వర్ధిలుచుండు. సాంఖ్యులమార్గమగు యింకొక విధానముకూడ కలదు. ఈపంథ మిక్కిలి శక్తివంతమైనదియు, పురుష ప్రకృతులను వేఱుచేయు నదియునగుచున్నది. మనస్సునందు సాక్షిభావము దృఢపడుటచే,మనఃప్రాణశరీరముల సర్వకార్యము బాహ్యక్రీడ యగుచున్నది. 'అది నేనుగాని నాదిగానికాదు. కేవలము ప్రకృతికి సంబంధించినది. నాపై బాహ్యమందది బలవంతముగా నారోపింపబడినది, నేను వీటిలో నెద్దానిచేతను బంధింపబడని సాక్షిపురుషుడను.' అను భావముచే, తుదకు సత్తయందు విభేద మేర్పడి, సాధకుడు తాను మనఃప్రాణ శరీరస్వభావములయొక్క ఉపరితల క్రీడనుండి భిన్నముగ నున్నానని తలంచును; శాంతము, నిశ్శబ్దమునైన ప్రత్యేక చైతన్యపు పెంపును తనలో అనుభవించుచుండు. సాధారణముగా నిది సంభవించినపుడు, ఉన్నత చేతనయొక్క శాంతిని, పరాశక్తియొక్క కార్యకలాపమును, యోగముయొక్క పూర్ణ గమనమును, శీఘ్రముగా క్రిందికి గొనివచ్చుటకు వీలగును. ఏకాగ్రతకు ప్రార్థనయందలి పిలుపుకు ప్రత్యుత్తరముగా, తఱుచు దివ్యశక్తియే

అవతరించును. అపుడివి యవసరమైనయెడల ఆశక్తియే వానిని సమకూర్చి, సాహాయకారులు నత్యావసరములు నగు నితర సాధనలను ప్రక్రియలను ఉపయోగించును.

మఱొక విషయము. ఊర్ధ్వమునుండి క్రిందికి గొని వచ్చు సాధనా విధానములో సాధకుడు సంపూర్ణముగా తన స్వశక్తిపైననే నాధారపడక, గురుని మార్గదర్శకతకు లోనై, జరుగున దంతయు, నాతని వివేకమునకు, తీర్పునకు, నిర్ణయమునకు విడిచిపెట్టుట అత్యంతావసరము. ఏలన, అవరోహణము వలన, నిమ్నప్రకృతియొక్క శక్తులు ఉద్రేకోద్వేజ్వాలనముల నొంది, దానితో కలిసి, దానిని తమ స్వలాభమునకై యుపయోగించుట తఱుచు సంభవించుచుండును, ఏదోఒక అసురశక్తియో వివేకశక్తియో, పరమేశ్వరుడుగనో, దివ్య'మాత'గనో ప్రత్యక్షమయి, సాధకునియొక్క సేవా సమర్పణము లపేక్షించుట గూడ, పలుమారు సంభవించుటయుగలదు. ఈసందర్భములకు లోనైనయెడల, నత్యంత విపత్కరమైనఫలితము గలుగగలదు. ఈశ్వర కార్యకలాపమునకు మాత్రమే యొప్పికోలు, ఆయన మార్గదర్శకతకు విధేయత, సమర్పణము నివి నిశ్చయముగా సాధన కున్నయెడల సకలము సవ్యముగానే జరిగిపోవును. ఈ యొప్పుదలయు, అహంకారము

తోకూడిన శక్తులను అహమున కిష్టమైన శక్తులను బరిత్యజించుటయు, సాధనావస్థయందలి రక్షణోపాయములు, కాని, ప్రకృతివిధానములు మాయాపూరితములు. అహంకారముయొక్క ప్రచ్ఛన్నవేషము లసంఖ్యాకములు. రాక్షసి మాయయు అసురశక్తుల మాయయు, అసామాన్య నైపుణ్యాయుతములు. హేతువాదనాశక్తి అసమర్థనీయమైన మార్గదర్శి. మఱియు పలుమారది ద్రోహిగా పరిణమించును. ఏ యాహ్వానమునేని, యనుకరింప ప్రేరేపించు, వ్యామోహాయుతమైన ప్రాణమయ కామనము మనల నిరంతర మంటియుండును. ఈ కారణమువలననే, మేమీ యోగములో సమర్పణమును గుఱించి యంత విశేషముగా నూదిపల్కుట. హృదయకేంద్రము సంపూర్ణముగా నున్మీలనమై, చైత్యపురుషు డెల్లపుడు వశుడైనయెడల, నేచిక్కును లేదు. అంతయు భద్రమే. కాని చైత్యసత్త ఏ క్షణమందైనను అధోప్రకృతి విజృంభణమువలన, నాచ్ఛాదితము గాగలదు. ఈ అపాయమునకు గుఱిగాకుండువారు చాల కొద్దిమంది మాత్రమే. నిజస్థితిలో నట్టివారికే సులభముగా సమర్పణము సాధ్యమగుచున్నది. ఈ ప్రయాసమగు ప్రయత్నమునందు, భగవత్ప్రీతినిధి, లేదా భగవానుని

తోడి తాదాత్మ్యస్థితి నొందినవారి యుపదేశసాహాయ్యము లనివార్యములు. యోగముయొక్క కేంద్రప్రక్రియ యను విషయమును గుఱించి నా యుద్దేశమేమో నేను వ్రాసినది, నీకుపకరించవచ్చును. నేను కొంత విరివిగానే వ్రాసితిని. కాని యది ముఖ్యవిషయములను మాత్రమే వివరించగలదు. మార్గమున కృషి చేయుకొలది, లేదా యంతకంటె నదియే యాతనిలో క్రియారూపముదాల్చు కొలది, సందర్భములు, పరిస్థితులు, కలుగుచుండు; ఏలన, సాధనలో క్రియాకలాపముయొక్క ఫలప్రదమైన ప్రారంభము జరుగునపుడు, కడపటిపద్ధతి సాధారణముగా సంభవించును.

⁂

ఇక నేకాగ్రత విషయము. సాధారణముగా చేతన సర్వత్ర వ్యాప్తమై, చెదరిపోయి, ఆ యీవిషయముల తట్టు, యిటునటు పరుగిడుచుండును, నేదేని దృఢమైన దానిని చేయవలసివచ్చినపుడు, చెదరియున్న ఈసకల చేతనను ఒకవైపున కీడ్చుకొని, ఏకాగ్రత నొనర్చుటయే మొదటిపని. తఱచి చూచినయెడల, అపుడే, నొకప్రదేశమందో, పనియందో, విషయమందో, వస్తువునందో, ఏకాగ్రిత గల్గియున్నట్లెన్నదగు. ఉదాహరణము : నీవు

కవిత్వమును చెప్పునప్పుడును, వృక్షశాస్త్రజ్ఞు డొకపుష్ప
మును బరిశోధించునప్పుడును యట్టి ఏకాగ్రత యుండును.
ధ్యాన విషయ మయ్యేనేని మెదడునం దెచ్చటనో
నొక స్థలమందును, భావవిషయ మయ్యేనేని హృత్క
మల మందును, ఏకాగ్రత ఉండును. అదే ప్రక్రియను
తీవ్రముగా విపులముగా నొనర్చుటయే యోగైకాగ్రత
యగుచున్నది. అది ఒకవస్తువుమీద కావచ్చును, ప్రకా
శించు బిందువుమీద త్రాటక మొనర్చునట్లు, అప్పుడా
బిందువునుమాత్రము జూచునట్లు, దానికన్న నన్యము
పైనే చింతన లేనట్లు ఏకాగ్రత నొనర్చవలసియున్నది.
ఏకాగ్రత, ఒక తలంపునందో, ఒక పదమునందో, ఒక
నామమందో, భగవద్భావమునందో, ఓంకారమునందో,
కృష్ణనామముమీదనో, భావపదములు లేదా భావనామ
ములు వీటియొక్క సంఘాతమునందో, వుండవచ్చును.
కాని యోగములో నింకను ఒకానొక నిర్దిష్టస్థానమున
గూడ నేకాగ్రత నొనర్చనగును. భ్రూమధ్యమున నేకా
గ్రత గావించు సుప్రసిద్ధ నియమ ముండనే యున్నది.
ఈ కేంద్రమున, ఆంతరిక మనస్సు, గుప్తదృష్టి, ఇచ్ఛా
శక్తి, ఉన్నవి. నీవుచేయున దేమనగా నీవు దేనిని యేకా
గ్రత విషయముగా గ్రహించితివో, దాని నిచ్చటనుండి

స్థిరముగా ధ్యానించుట, లేదా, తద్రూపము నచ్చటనుండి దర్శింప బ్రయత్నించుట. నీ విం దుత్తీర్ణుడ వైతి వేని,కొంత కాల మైనతరువాత నీసమస్త చేతనయు నిచ్చట కేంద్రీకరింపబడినట్లు నీకు స్ఫురించును. అది అప్పటికిమాత్రమే. దానినట్లు కొంతకాలము తఱుచుగా నభ్యసించిన తరువాత, అది సులభము, నైజమును యగుచున్నది.

ఈ విషయము స్పష్టమైనదని తలంచెదను. ఈ యోగమందు, నీవా ప్రక్రియనే అభ్యసింపుము. కాని, భ్రూమధ్యమం దా ప్రత్యేక స్థానముననేగాక, శిరస్సునం దెచ్చటనైనను, లేదా శరీరశాస్త్రజ్ఞులు గుండెకాయ స్థానమని స్థిరపఱచిన హృదయకమలమందైనను, ధ్యానమొనర్చుము. ఒకానొక విషయముపై ధ్యానమొనర్చుటకు బదులు, శిరస్సునందొక సంకల్పముమీదనో, ఊర్ధ్వమునుండి శాంత్యవరోహణమునకైన అహ్వానమునందో, లేదా కొందఱొనర్చునట్లు మూయబడిన హిరణ్మయపాత్రను తెఱవమని ప్రార్థించుటయందో, ఊర్ధ్వచేతనారోహణమునందో,ఏకాగ్రత గావింపుము. హృదయ కేంద్రమున, ఉన్మీలనమునిమిత్తము, భగవానుని సజీవరూపసాన్నిధ్యముకొఱకు, లేదా మఱేయుద్దేశ్యమైననుసరే దాని నిమిత్తమును, అభీప్సాపూర్వకముగా నేకాగ్రత

నొనర్చనగును. ఒకనామజపమే గావచ్చును. అట్లగుచో, దానిమీదగూడ నేకాగ్రత యుండవలయును. ఆనామము హృదయకేంద్రమున తనంత దా జపించునట్లుకానవలెను. ఇట్లొకేస్థానమున నేకాగ్రత నొనర్చునపుడు తక్కిన చేతనాంశమే మగుచున్నదని ప్రశ్నింపవచ్చును. ఎట్టి ధ్యానమందైనను అది నిశ్చలమగును. అటుకానిచో, చింతనలు ఇతరవిషయములు బాహ్యమున జరుగునట్లు సంచరించుచుండవచ్చును. కాని, ఏకాగ్రతనొందిన భాగము మాత్రము వానిని గమనించదు, సరకుగొనదు. ఏకాగ్రత చాలమట్టుకు జయప్రదమైనపుడే యీపరిస్థితి కల్గుట సాధ్యమగును.

ప్రారంభదశలో, అలవాటులేనివారెవరును, దీర్ఘకాలము ధ్యానమొనరించి ఆయాసపడగూడదు. ఎందుకన, చాలా కష్టపడి యలసిపోయిన మనస్సునందు ధ్యానము, తనశక్తిని, విలువను గోల్పోవుచున్నది. ఏకాగ్రత నొనర్చుటకు బదులు, ప్రయాసపడకుండ నెమ్మదిగా ధ్యానమొనర్చనగును. ఏకాగ్రత సహజమైనపుడు మాత్రమే మఱింత దీర్ఘకాలము దాని నభ్యసింపనగును.

***

# కర్మ

అనుభవముల జెందు నిమిత్తము కేవల మంతర్ము ఖులమై, కర్మ నుపేక్షించుట వలన, బాహ్య చేతన సమత్వమును గోల్పోయి, సాధన పాక్షికమగుచున్నది. ఏలన, మనయోగము పూర్ణమైనది. అట్లే, బహిర్ముఖులై పోయి, బాహ్యసత్తయందు మాత్రమే యుండుట గూడ, సమత్వమును బోగొట్టుకొనుట యగు, సాధన పాక్షికమగును. అంతరానుభూతియందును బాహ్యకర్మ యందును, ఒకేవిధమైనచేతన గలిగియుండవలెను, మఱి యు నీరెంటిని మాతృశక్తిమయ మొనర్చవలెను.

***

అంతరానుభూతికిని బాహ్యాభివృద్ధికిని మధ్య సమత్వమును నిలబెట్టుటకు, కర్మానుష్ఠానము సాయపడు చున్నది, లేనిచో స్వల్పాభివృద్ధి, సామరస్యవిచక్షణాలు లేకపోవుట సంభవించును. అదియునుగాక, భగవానుని కొఱకు కర్మయోగము సాధించు టవసరము. ఏలన,

తుదకది సాధకునియందలి అంతరాభివృద్ధిని బాహ్య ప్రకృతిలోనికి జీవితములోనికి తీసికొనివచ్చి, సాధన యొక్క ప్రపూర్ణతకు తోడ్పడుచున్నది.

***

సర్వము నంతస్స్థితిపై నాధారపడియున్నది. బాహ్యస్థితి అంతస్స్థితిని వెల్లడించుటకును, స్థిరపఱచుటకును, దానిని శక్తివంతముగా ఫలప్రదము చేయుటకు మాత్రమే నొక యుపాయముగా, సాహాయ్యముగా బనికివచ్చును. చైత్యశక్తియుతముగనో లేక యథార్థ అంతస్స్పర్శశక్తియుతముగనో, నీ వేదిచెప్పినను, చేసినను, అది ఫలవంతమగును. దానినే, నీవు మనస్సునందుండియో, ప్రాణికమునుండియో, లేదా మిశ్రితమును తప్పనగు వాతావరణమునందుండియో, చెప్పినను, చేసినను, అది చాల నిష్ప్రయోజనము గావచ్చును. సరియైనకార్యమును ప్రతిసందర్భములో సరిగాజేయుటకు, ప్రతిక్షణమునందు సరియైనచేతనలో నుండవలెను. అదియొక నిర్ణీతమైన మానసికధర్మము ననుసరించుటవలన నెఱవేరదు. ఆ మనోధర్మము కొన్ని పరిస్థితులలో సరిపోవచ్చును, మఱికొన్నిసందర్భములలో సరిపోకపోవచ్చును. దానిని సత్యముతో సంధానమొనర్చినయెడల, ఒక సామాన్య

నియమము విధింపబడినదగును. కాని ప్రతిమెట్టున నేమి చేయవలయు నేమిచేయరాదనుటయు, దాని ప్రయోగ విచక్షణలు యివన్ని అంతఃచేతనమువలననే నిర్ణీతము కావలయును. చైత్యసత్త ప్రాముఖ్యముగ నున్నచో, ఆధారమును సమగ్రముగ దివ్య'మాత' కభిముఖము చేయగల్గి, చైత్యము ననుసరింపజేసినచో, యిదంతయు నధికముగా జేయ సాధ్యమగును.

***

భావమును సహజముగ నుంచుకొనుటమాత్రమే చాలదు: కాని సర్వకాలము తద్భావమును సజీవముగా నుంచుకొనుటకు, ప్రతికార్యమును 'మాత' కర్పణముగా చేయవలెను. కర్మ చేయునపుడు ధ్యానముచేయరాదు. ఏలన, దానివలన, పనినుండి శ్రద్ధ తొలగును. కాని, ఆ పని నెవరికర్పింతువో, ఆ యొక్కరి స్మృతి నిరంతర ముండవలెను. ఇది ప్రథమ విధానముమాత్రమే. ఏలన, బాహ్యమనస్సు పని చేయుచుండగా, లోన, భగవంతుని సాన్నిధ్యభావమందు నిమగ్నమైన శాంతిమయ భావమును నీవుంచుకొనగలిగి యున్నపుడును. లేదా, కార్యముచేయునది 'మాత'శక్తి యనియు, నీవాశక్తి యొక్క ఉపకరణము, మార్గము మాత్రమే యనియు

భావింప నారంభించినపుడును, స్మృతికి బదులు, కర్మ కాండలో స్వతఃప్రవృత్తము, నిరంతరమునగు యోగ సిద్ధి, భగవత్సంయోగము ప్రారంభమగును.

***

స్వకీయోద్దేశములు లేనట్టియు, పేరుప్రతిష్ఠలు రావలెననియు, ప్రజలు తన్నుగుర్తించవలెననియు, లోకాధిపత్యము కావలెననియు కోరకుండ, తన స్వంత మనోభావములపట్లగాని, లేదా ప్రాణమయ మోహములు, కామనా భౌతికాధిపత్యములు వీనిపట్లగాని పట్టుబట్టకుండ, గర్వము అనాగరికాత్మాభిమానము, పదవీప్రతిష్ఠలకై ప్రాకులాడుట, ఇవి లేకుండ, భగవానునికొఱకును, భగవదాదేశముననే చేయబడు కర్మమాత్రమే, ఆధ్యాత్మికముగ జీవుని బరిశుద్ధమొనర్చును. అహంకారముతో నొనర్చు సకల కర్మయు, మూఢజగత్తులోని ప్రజల కెంత మంచిదైనను, యోగాన్వేషికి గానేరదు.

***

సామాన్యజీవితము కొంత మానసికము లేదా నైతిక పరమువనుండునట్టియు, ఒకప్పుడు మానసికాదర్శముచే దిద్దబడినట్టియు, కామనాసంతృప్తికిగాను, స్వలక్ష్యముతో కూడిన కర్మతో నిండినదై యుండు. భగవ

దర్పణముగా తనకర్మ నర్పించుటలోను కోరికను జయిం చుటలోను, అహంకారరహితము నిరపేక్షికమైన పని లోను, భగవద్భక్తితోను, విశ్వచేతనలోనికి ప్రవేశిం చుటలోను,అఖిలభూతములతోటి ఐక్యభావము నందుట లోను, భగవానునితో నేకత్వోపలబ్ధి నందుటలోను, గీతాయోగ మిమిడియున్నది. ఈ యోగముయొక్క లక్ష్యమేమన, అతీతమనస్సుయొక్క జ్యోతిని, తుదకు శక్తిని క్రిందికి గొనివచ్చుటయు, మానవస్వభావమును పరివర్తనము జేయుటయు నగుచున్నది.

⁂

నీవుచేయు ఒకానొకపనిమీద ఆత్మ నివేదన మాధారపడియుండదు. మఱేమన, నీవు సకల కార్యము లను,-అదేవిధమైనదేని యగుగాక,-ఏభావముతో జేయు దువో, దానిపై నాధారపడియుండును. భగవదార్పణ ముగా, కామనాహంకారములు లేక, శుభాశుభములందు సమత్వముతోను, నిశ్చలమైనశాంతితోను, భగవానుని నిమిత్తమేగాని ఏదోస్వలాభము,ప్రతిఫలాకాంక్ష ప్రయో జనములకుగాక,సకలకార్యములు భగవచ్ఛక్తివే యను మనస్సుతో చక్కగా శ్రద్ధగా జేయు నేకార్యమేని, కర్మ ద్వారమున నాత్మ నివేదనమున కుపాయమేయగును.

***

అసమర్థత, జడత, నిష్క్రియత, వీనికి లోనైన చో, కేవలము సామాన్యమగు శరీరమునకు సంబంధించి నట్టి, యంత్రమువలె చేయునట్టి సాధారణపని కూడ చేయబడజాలదు. ఇట్టి జడ విధాన కార్యక్రమము తో తృప్తిబడక. అసమర్థత, జడత, నిష్క్రియత,వీనిని నిరాకరించి త్రోసివేసి, మాతృశక్తికి నీవు ఉన్మీలితుడ వగుటయే, దీని కుపాయము. దంబము, అత్యాశ, స్వాభి మానము, ఇవి నీ మార్గమున కడ్డువచ్చెనేని వానిని త్రోసిపారవేయుము. వాటికై యవే యంతరించి పోవల యునని నీవూరకున్నచో, నీవు వీనినుండి విముక్తుడవు గానేరవు. సందర్భపరిస్థితులు కల్గుటకు నీవు కాచుకొని యున్న, నసలవి యెందుకు సంభవించవలయునో కారణ మగుపడదు. అద్భుతగులునది, అసమర్థత దౌర్బల్యము లైనప్పటికిని సరిగా నధికాధికముగా మాతృశక్తి కభిముఖ మగుకొలదియు, కర్మ కవసరమైన శక్తిసామర్థ్యములు ప్రసాదింపబడును. అవి యాధారమందు వర్ధిల్లగలవు.

***

అత్యంతశ్రద్ధతో 'మాత' కార్యము నిర్వహించు వారు, ధ్యానమునకు కూర్చొనకపోయినను, ఏదేని

యొక నిర్దిష్టమైన యోగసాధన చేయకున్ననుగూడ, వారుచేయు కర్మాచరణవలననే, సరియైనచేతన కాయ త్తమొనర్చబడుదురు. ధ్యాన మెట్లుచేయవలసినది నీకు దెలుప నవసరము లేదు. నీవు చేయు కార్యమందును అన్ని సమయములయందును నీవు శ్రద్ధాభక్తులతో 'మాత'కుస్మీలితుడవై యున్నయెడల, కావలసినదంతయు దానంతనదే లభించును.

***

చేతనోన్మీలన కేమియర్థమో, కర్మోన్మీలనమున కదే యర్థమని తెలిసికొనవలయును. ధ్యానమందు నీ చేతనలో నేశక్తి వ్యవహరించి, దానికి నీవు ఉన్మీలితుడ వైనపు డెల్లను, నీలోని మాంద్యమును, కలవరమును, తొలగించుచున్నదో, ఆ శక్తియే, నీకర్మను గైకొని, ఆ కర్మయందలి లోపముల నీ వెఱుంగునట్లుచేయుటయే గాక, యింకనేమి చేయవలసినది నీకెఱుకబఱచి, దాని నొనర్చుటకు నీమనస్సునకు చేతులకు త్రోవ చూపగలదు. నీవుచేయుకార్యమం దాశక్తికి నీవు ఉన్మీలితుడ వైనచో,నీ కార్యకలాపముల కన్నింటివెనుక నాదివ్య 'మాత' యొక్క శక్తిసాన్నిధ్యముల ననుభవింపగలవు.

***

కర్మలుచేయవీలులేని సాధనావస్థ ఏదియులేదు; మార్గమున కాలూనుట కవకాశములేనట్టిత్రోవయును, భగవానునిపట్ల నేకాగ్రత కావలయునన్న కర్మసన్యాస మొనర్పవలసిన అవసరమునులేదు. కాలూనుటకు స్థల మెప్పుడునుగలదు. భగవానునిపై నాధారపడియుండుట, భగవానునకు స్వభావమును, ఇచ్ఛాశక్తుల నుస్మీలన మొనర్చుట, భగవానుని శరణుజొచ్చుట; ఇదియే కాలూనుస్థలము. అట్టిమనస్సుతోజేయు సకల కర్మయు సాధనకు తోడుగా నొనర్చినదగును. అక్కడక్కడ, ఒకా నొక సాధకునికి స్వల్పకాలము ధ్యానమున నిమగ్నమై యుండుట, అట్టికాలములో కర్మను ఆపివేయుట, లేదా దానికంత ప్రాముఖ్య మివ్వకుండుట అవసరము కావచ్చును. కాని, అదియొక వ్యక్తి విషయమును గుఱించి నట్టి తాత్కాలిక కర్మ విరమణము మాత్రమే కాగలదు. ఇంతియగాక, సంపూర్ణ కర్మ సన్యాసము, పూర్ణముగ సమాధిలో నిమగ్నులగుట, తఱచుగా మంచిదికాదు. దీనివలన నొక పాక్షికము మిథ్యయునగు స్థితి సంభవింపవచ్చును. అప్పుడది బాహ్య సత్యమునందుగాని, పరమసత్యమునందుగాని గట్టిపట్టె మియు లేనటువంటిన్ని, పరమసత్యమునకు బాహ్యజీవ

నోపలబ్ధికి మధ్య నొకదృఢసంబంధమునకు, కలియికకు, వలయు నంతఃస్థితానుభూతుల యొక్క సదుపయోగము లేనటువంటిన్ని, కేవల మంతస్థితానుభూతుల యొక్క ఒకవిధమగు మధ్యప్రపంచమున జీవించెడిస్థితిలో నుండుటకు ప్రోత్సహించవచ్చును.

కర్మ రెండువిధములుగా నుండనగును. సాధన కొఱకు అనుభవక్షేత్రమైన కర్మయొకటి. ఇది సత్త యొక్క క్రియాకలాపములయొక్క క్రమాభివృద్ధికరమగు అవిసంవాదము, పరివర్తనము, వీనికొఱకు నుపయోగించబడును. మఱొక కర్మ, భగవదుపలబ్ధిని వ్యక్తమొనర్చునది. కాని ఉపలబ్ధిని సంపూర్ణముగా పృథ్వీచేతనలోనికి కొనిరాబడినపుడు మాత్రమే, యీ రెండవదానికవకాశము గలదు. అంతవఱకు సకల కర్మయు నుద్యమక్షేత్రముగా ననుభవ పాఠశాలగా నుండవలసినదే.

***

నేనెప్పుడు భక్తి వలదనలేదు. మఱియు నెప్పుడు గాని ధ్యానమునైనను నిషేధించినట్లు నాకు మతికి రావడంలేదు. వాటిలో దేనికేని శంకరులవలె, లేదా చైతన్యులవలె, నేను ప్రత్యేక ప్రాముఖ్యత నొసంగకున్నప్పటి

కిని, నాయోగమందు కర్మలతోబాటు, భక్తి జ్ఞానముల రెంటికిని ప్రాధాన్య మిచ్చియున్నాను.

సాధన విషయము నీవుగాని మఱేసాధకుడుగాని, యనుభవించెడి కష్టము నిజముగా, భక్తి, జ్ఞాన, కర్మల, పరస్పర సంబంధముగుఱించినదికాదు. నీభావ వైఖరినిబట్టియు, నీవు దానినెట్లు సమీపించవలసినదానిని బట్టియు కష్టము కల్గుచున్నది.

ఇంతవఱకు, నీవు పనిచేయుచున్నపు డంతయు, భగవానుని స్మరణయం దుంచుకొనలేకున్నను, ఎక్కువ ప్రమాదములేదు. కర్మ ప్రారంభమున భగవానుని జ్ఞాపకముంచుకొనుట, ఆయన కర్పించుకొనుట, కడపట ప్రణమిల్లుట, యిప్పటికిచాలును. అథవా, మధ్యమధ్య, విరామము దొరికినపు డాయనను జ్ఞాపకమునకు దెచ్చుకొనుటగూడ చాలును. నీ వనుసరించుపద్ధతి బాధకమైనదిగను, కష్టమైనదిగను నాకు తోచుచున్నది. మనస్సుయొక్క ఒకేభాగముతో నీవు పనిచేయుటకును, జ్ఞాపకముంచుకొనుటకును నీవు ప్రయత్నించుచున్నట్లు కనబడుచున్నది. అది సాధ్యమగునని నాకు కనపడదు. పనిచేయు కాలమునం దంతను సాధకులు భగవానుని జ్ఞాపకముంచుకొనునప్పుడు, (అది

చేయనగును) సాధారణముగా నది మనస్సుయొక్క భాగముతోడనే, అట్లుగాకున్న వారిలో ద్వివిధచింతనా విధమో, ద్వివిధ చేతనానుభవశక్తియో సృష్టింపబడు చున్నది,—ఒకటి ముందుగనుండి పనిచేయునది, మఱొక టి అంతఃస్థితముగ నుండి, సాక్షిభూతముగ చూచుచు జ్ఞాపకముంచుకొనునది, మఱొకపద్ధతియు గలదు,—యిది చాలకాలము నాపద్ధతిగా నుండినది,—చేతన భగవాను నందు నిశ్చలముగ నిలిచియుండ, స్వచింతనా, మనో వ్యాపారములు లేకనే, తనంతకదే కర్మ సాగుచుండెడి పద్ధతి. ఇట్టిదశ కేవల ప్రయత్నమునగాక, నిరంతరాభీప్స వలనను, నివేదనాసంకల్పము వలనను, లేదా, కారణ సత్తనుండి బాహ్యసత్తను విడదీయుటవలనకల్గిన చేతనా ప్రవృత్తివలనను లభించును. కర్మనొనర్చుటకై దివ్య శక్తిని క్రిందికాహ్వానించెడి అభీప్స, నివేదనాసంకల్పము, ఇది కొందఱిపట్ల నెక్కువకాలము పట్టినప్పటికికూడ, గొప్పఫలితముల గొనితేగలమార్గముగా నున్నది. మనో ప్రయత్నమున కర్మ చేయుటకు బదులు, వెనుకగాని పైనగానియున్నశక్తిమూలమున నెట్లు కార్యములు సాధింపనగునో ఎఱుంగుటయే నీమార్గము. సాధనయొక్క విశేష రహస్యము. మనోప్రయత్న మనవసరమనిగాని,

నిష్ఫలమనిగాని నేనన లేదు. కాని, మనస్సు తానే సర్వము చేయుటకు బ్రయత్నించినయెడల, నెవరో యాధ్యాత్మిక యోధులకుతప్ప, నది బహుశ్రమకరమైన ప్రియత్నమే యగును. అట్లని, యిదివరలో చెప్పిన అన్యపద్ధతియే కోర తగిన దగ్గరిదారియని నాభావముకాదు ; నేను చెప్పినట్లు ఫలితమునకు చాలకాలము పట్టవచ్చును. సాధనయొక్క ప్రతిమార్గమందును, ఓపిక, దృఢ నిశ్చయము ఇవి యవసరములు.

బలయుతులకు బలముపైన నాధారపడుట సరియే. కాని అభీప్సయు, దానివలన ప్రసాదింపబడిన దివ్యాను గ్రిహము కేవలము మిథ్యలుగావు. అవి అధ్యాత్మిక జీవనమందలి మహాసత్యములు.

⁂

కర్మ యనగా, నహంత తృప్తికొఱకు రాజసిక కామనాప్రోద్బలముచే, అహంకారముతో, నజ్ఞానముతో, చేయబడుకార్యమని నా యుద్దేశముగాదు. అవిద్యా ముద్రలగు అహంకారము, రజస్సు, కోరిక, వీని నంత మొందించవలెనను. ఇచ్ఛలేకుండ, కర్మయోగమే యుండజాలదు.

మానవుని మనస్సు ప్రత్యామ్నాయ మొనర్చు నట్టి, నైతికము నాదర్శభావకల్పితమునగు, పరోపకారము, మానవసేవ, మొదలగువాని నన్నింటిని, కర్మల యొక్క గభీరసత్యముగా, నేను పరిగణించుటలేదు.

కర్మయనగా భగవానునికొఱకు భగవానునితోడి యధికాధిక సంయోగమున జేయబడుకార్యమనియే నా యుద్దేశ్యము. ఇది కేవలము భగవానునికొఱకై మఱెందుకును గాకుండవలయు. గభీరధ్యానము, తేజోమయమగుజ్ఞానము, నిజమైన ప్రేమభక్తి ఇవి యెట్లుసులభసాధ్యములుకావో, అట్లే, కర్మకూడ నారంభమునందు స్వాభావికముగా సులభమైనదికాదు. కాని, యితరవాటితోపాటు, దానిని సద్భావముతోను, సదిచ్ఛాసంకల్పములతోను ప్రారంభించవలసియున్నది. అట్టితరి, తక్కినదంతయు ననుకూలమగును.

ఈభావముతో చేయబడుకర్మలు, ధ్యానభక్తులంత ఫలప్రదములు. కామనారజోహంకార విసర్జనచే నిశ్చలతయు, పవిత్రతయు కల్గును. తదుపరి వీనిలోని కనిర్వచనీయమైన శాంతి అవరోహించగలదు. తన ఇచ్ఛను భగవదిచ్ఛకు నర్పించుటవలనను, దానితో లీన మొనర్చుట వలనను, విశ్వచేతనలోనికి విస్తరించుట వల

నను, విశ్వచేతన కావలనున్న దానిలోని కుద్దమించుట వల
నను, అహంకార రాహిత్యముసిద్ధించును. ప్రకృతిబంధ
ములనుండి పురుషుడు వీడి, ముక్తిని బొందును. తన
అంతస్సత్త నెఱుంగుచు బాహ్యసత్త నొక యుపాధిగా
జూడబడును. విశ్వశక్తియే తన కార్యముల చేయుచున్నట్లు
ను, పురుషుడు సాక్షిమాత్రుడుగను, ద్రష్టగ నున్నట్లు కాన
నగు. తన కార్యముల నన్నింటిని తననుండి విశ్వ'మాత'
యగు పరాశక్తిగైకొని చేసినట్లును, లేదా హృదయాంత
రాళమునుండి భగవచ్ఛక్తి నడిపించుచు, వ్యవహరించు
చున్నట్లు అనుభవముకల్గును. సర్వకర్మేచ్ఛలను నిరంతర
ము భగవానునికి నివేదించుటవలన, ప్రేమార్చనలు
ప్రవర్ధమానములై, చైత్యసత్త ముందుకు వచ్చును. వీటిపై
నున్న శక్తికి నివేదించుటవలన, ఊర్ధ్వమున ఆశక్తిని, దాని
యవరోహణమును, వికాసమానమగు చేతనా జ్ఞానోన్మీల
నమును అనుభవింతుము. తుదకు, కర్మ, భక్తి, జ్ఞానము
లొకటై, ఆత్మసిద్ధి, అనగా, మన మనుకొనే ప్రకృతి
పరివర్తనము సాధ్యము కాగలదు.

ఈఫలితము లన్నియు నిశ్చయముగా నొకేసారి
లభించవు. జీవునియొక్క స్వభావప్రవృద్ధిస్థితుల ననుస
రించి, యవి ఇంచుమించుగా నసంపూర్ణముగనో, నిదా

నముగనో లభించగలవు. ఈశ్వర సాక్షాత్కారమునకు రాజబాటయే లేదు.

సమగ్రమైన ఆధ్యాత్మికజీవనమునకు, నేను విపులీకరించిన విధముగా, గీతలో సిద్ధాంతరీకబడిన కర్మయోగ మిదియే. అది యూహాతర్కములపైనగాక, అనుభవముమీదనే నెలకొల్పబడియున్నది.

అది ధ్యానమును త్రోసిపుచ్చదు, భక్తిని నిస్సందేహముగా నిరాకరించదు. ఏలన, కర్మయోగసారమగు, తనను తనకున్న సర్వమును బ్రహ్మార్పణము చేయుట, ఇవి భక్తిమార్గ ప్రవృత్తులే. కర్మసన్యాసముతో కూడిన తదేకధ్యానమును, తన అతీతఃస్వప్నమందు నిబద్ధమైనట్టి యుద్రేకముతో కూడిన భక్తిని, యోగము యొక్క సంపూర్ణ మార్గముగామాత్ర మీ సిద్ధాంత మంగీకరించదు. పరిశుద్ధాంతధ్యానమును, అంతఃస్థితము, అచంచలమునగు భక్త్యానందములను, గుట్టలకొలది ఒకరు అనుభవింపవచ్చును, కాని యివి పూర్ణయోగము యొక్క సర్వస్వముమాత్రము గానేరవు.

***

సమాప్తము